# శ్రీరామాచల పూర్ణబోధిని.

గ్రంథకర్త

బ్ర॥ హ్మ॥ శ్రీ॥ వారణాసి రామయ్యా

హరిదాసు. గారు.

ప్రతులు. ౧౦౦౦

మ॥ రా॥ కొండా చెన్నరెడ్డి తమ్ముడు వెంకటరెడ్డి.
రాజశ్రీ చిరాగువీరన్న తమ్ముడు బుచ్చన్న.
తోటా ఈశ్వరయ్య. మొదలుగాగల సద్భక్తుల
ద్రవ్యసహాయముచేత,
పంచాక్షరీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

హైద్రాబాద్.
[దక్కన్.]

వైశాఖ॥ బ॥ ౧౩ మంగళవారం.

శ్రీదత్తాత్రేయాయనమః.

క॥ గురురూప నీమహాత్మ్యము । గుర్తెరుగరు నరులు మూఢగుణములచేతన్ । గుటమంత్రమిచ్చి బ్రోవవే । గురురాజదత్తమూర్తీ గుణవిస్ఫూర్తీ ।

గ్రంధాభిమానులు.

బ్ర॥ శ్రీ॥ బ్రహ్మాండం నరసింహ్మారావు.
చివుకుల వెంకటాచల శాస్త్రి.
నారాయణం నరసింహ్మ శాస్త్రి.
పెద్దిబోట్ల సీతయ్యగారు.
భాస్కరబోట్ల చెల్లయ్యగారు.
తీగెవలుపు శేషయ్యగారు.
సాగి వెంకటరామయ్య. రామచంద్రయ్య.
వేమవరపు విశ్వనాధం॥
జానకి రామారావు.
లక్ష్మీరావు పట్వారి పేదమంగలారం.
కంభంపాటి రామక్రిష్ణ సోమయాజులుగారు.
ఏ. కాశీపతి గారు.
మశురబాద పాండురంగయ్య
శికింద్రాబాదు వైశ్యులు.

మ॥ రా॥ ముస్త్యాల మానయ్య.
బూరుగు విశ్వనాధం తమ్ముడు మహాదేవు వీరన్న.
వంగపల్లి వీరేశలింగం.
వంగపల్లి నీలకంఠం.
వుపలంచి రాజన్న.
తోట ఈశ్వరయ్య.
పాత లక్ష్మయ్య.
శ్రీరాం లింగమూర్తి.
మదూరిక్రిష్టయ్య.
తొడ్పునూరి కొండయ్య.
శేజంతల లింగన్న.



హరిః ఓమ్.

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ పాండురంగ పరబ్రహ్మణే నమః

శ్రీమదవధూత గోపాల వేంకటేంద్రాయ నమః

# శ్రీ రామాచల స్ఫూర్తిబోధిని.

శ్లో॥ శ్రీగురుం విమలానందం । పరాత్పరజగత్ప్రభుమ్ ।
త్రైలోక్యవ్యాపకం దేవం । శుద్ధమత్యంతనిర్మలమ్ ॥

శ్లో॥ నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై । నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః ॥ ... ... ... ... ... ...

శ్లో॥ లక్ష్మీర్యస్య పరిగ్రహః కమలభూః సూనుర్గరుత్మాన్ రథః ।
పౌత్రశ్చంద్రవిభూషణస్సురగురుః శేషశ్చ శయ్యాసనమ్ ।
బ్రహ్మాండం వరమందిరం సురగణా యస్య ప్రభోస్సేవకాః ।
స త్రైలోక్యకుటుంబపాలనపరః కుర్యాత్సదా మంగళమ్ ॥

" " బ్రహ్మా వాయుగిరీశ శేషగరుడా దేవేంద్రకామౌ గురుశ్చం
ద్రార్కౌ వరుణానలౌ మనుయమౌ విత్తేశవిఘ్నేశ్వరౌ ।
నాసత్యౌ నిరృతిర్మరుద్గణయుతాః పర్జన్యమిత్రాదయః ।
సశ్రీకాస్సురపుంగవాః ప్రతిదినం కుర్వంతు నో మంగళమ్ ॥

" " విశ్వామిత్ర పరాశరౌర్వభృగవోఽగస్త్యః పులస్త్యః క్రతుః
శ్రీమానత్రిమరీచకౌత్సపులహాః శక్తిర్వశిష్ఠోఽంగిరాః ।
మాండవ్యో జమదగ్ని గౌతమ భరద్వాజాదయస్తాపసాః ।
శ్రీమద్విష్ణుపదాబ్జభక్తినిరతాః కుర్యాత్సదా మంగళమ్ ॥

,,,, మాంధాతానహుషోంబరీషసగరౌ రాజాపృథుర్హైహయః।
శ్రీమాన్ ధర్మసుతో నలో దశరథో రామోయయాతిర్యదుః।
ఇక్ష్వాకుశ్చ విభీషణశ్చ మరుతస్సోత్తాన పాదధ్రువాః।
ఇత్యాద్యాభువిభూభుజః ప్రతిదినం కుర్యాత్సదామంగళమ్॥
,,,, శ్రీమేరుర్హిమవాంశ్చమందరగిరిః కైలాసశైలస్తదా।
మాహేంద్రో మలయశ్చవింధ్యనిషధౌ సింహాస్తథారైవ
తః। సహ్యాద్రిర్వరగంధమాదనగిరిర్మైనాక గోమంతకాః।
ఇత్యాద్యాఘనభూభృతః ప్రతిదినంకుర్యాత్సదామంగళమ్॥
,,,, గంగాసింధు సరస్వతీచ యమునా। గోదావరీ నర్మదా
కృష్ణా భీమరథీచ ఫల్గుసరయూః శ్రీగండకీ గోమతీ।
కావేరీ కపిలా ప్రయాగవినతా। వేత్రావతీ వ్యాదయో
నద్యః శ్రీహరి పాదపంకజభవాః కుర్యాత్సదామంగళమ్॥
,,,, వేదాశ్చోపనిషద్గణాశ్చ వివిధాః స్సాంగాః పురాణాన్వితా
వేదాంతాఅపి మంత్ర తంత్ర సహితాస్తర్కాః స్మృతీనాం
గణాః కావ్యాలంకృతి నీతినాటకగణాశ్శబ్దాశ్చనానావిధాః
శ్రీవిష్ణోర్గుణరాశి కీర్తనపరాః కుర్యాత్సదామంగళమ్॥
,,,, ఆదిత్యాది నవగ్రహాశ్శుభకరా మేషాదయోరాశయః
నక్షత్రాణి సయోగకాశ్చ తిథయస్తద్దేవతాస్తద్గణాః। మా
సాబ్దాఋతవస్తథైవ దివసా స్సంధ్యాస్తథారాత్రయః। స
ర్వే స్థావరజంగమాః ప్రతిదినం కుర్యాత్సదా మంగళమ్॥
,,,, ఇత్యేతద్వర మంగళాష్టకమిదం శ్రీవాదిరాజేశ్వరై ర్వ్యా
ఖ్యాతం జగతామభీష్ట ఫలదంసర్వాశుభధ్వంసనం। మాం
గల్యాది శుభక్రియాసు సతతం సంధ్యాసు వాయఃపఠేద్ధ
ర్మార్థాదిసమస్తవాంఛితఫలం ప్రాప్నోత్యసౌ మానవః॥

వాదిరాజకృత మంగళాష్టకం సంపూర్ణమ్.

శ్రీకృష్ణార్పణమస్తు.



హరిఃఓమ్.

శ్రీ దత్తాత్రేయాయనమః

శ్రీగోపాల స్వామి సద్గురవే నమః.

# శ్రీ రామాచల పూర్ణబోధిని.





—* నాంది. *—

శా. శ్రీరామాచల పూర్ణ బోధకుఁడవై చిద్రూప తేజుండవై ।
సారాచార విచారనిర్గుణుఁడవై సన్మౌని పాత్రుండవై ధీరాకా
శపరా పరాత్పరుఁడవై దేదీప్య మానుండవై కారుణ్యంబున
దాస పోషకుఁడవై కన్పట్టు నిన్ వేఁడెదన్. ...

## దైవ ప్రార్థన.

సీ. శాంతాయ దాంతాయ సత్యస్వరూపాయ శ్యామలదేహాయ
శరణుశరణు । యోగసంపూర్ణాయ యోగాదినిష్ఠాయ సచ్చిదా
నందాయ శరణు శరణు । నిర్గుణబ్రహ్మాయ నిర్మలానందాయ
సద్రూప చిద్రూప శరణుశరణు । బ్రహ్మాండ భాండాదిప్రా
ణాధి దేవాయ సారవిచారాయ శరణు శరణు గీ. సంచితా
ఘ వినాశాయ శరణు శరణు గరుడవాహనానాథాయ శరణు
శరణు పరమ. పురుషాయ బ్రహ్మాయ శరణు శరణు సత్యచరి
త్రాయ నిత్యాయ శరణుశరణు ॥ ..

పాలరాధికా ప్రాణలోల ॥

—(గ్రంథకర్త)—

గీ॥ పరగగోపాలదేశిక ప్రభునిపాద । పద్మములభక్తినిల్పెడి పా
వనాసి । రామయాఖ్యాత సజ్జనప్రేమపరుడ । దత్తయోగిం
ద్రుగొలిచెడి ధరణిసురుడ ॥

గీ॥ కోటయాఖ్యునాం బలకోర్కె దీర వసుధహరితసగోత్ర వి
వర్ధనముగ । బుట్టిగోపాలదేశికు బోధవలన దత్తయోగీంద్రు
పదపద్మ ధ్యానమంటి ॥

క॥ హరిసేవాద్యర్చనలును । గురుభక్తియు తత్వమహిమ గుఱు
తెఱుఁగ । సద్గురువరుఁడు పూర్ణప్రబోధ । హరిదాసను నా
మమిడియె యాస్వానుచున్ ॥

కావున నాయిష్టదైవమగు శ్రీదత్తాత్రేయులను నేజెప్పఁబోవు
పూర్ణబోధ నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొందించుటకు కరకమలం
బుల ముకుళించి యథాశక్తి పూజగావించి ప్రార్థింపుచున్నాడను.

గీ॥ అత్రితనయనసూయ దంపతుల్ హర్షమొందను । యోగమార్గ
ప్రవృత్తి వియోగపతివి । సత్వసద్గుణ సద్రూప సత్యదేవ ।
తాపసకులవివర్ధన దత్తమూర్తి ॥

గీ॥ సగుణనిర్గుణ బ్రహ్మైక్య సాధనములు । శాశ్వతానంద దా
యిమా చరిత రచన । సేయుబూనితి గావున శ్రీశకేశ । తప్పు
విడి యొప్పుగనుజూడు దత్త మూర్తి॥

గీ॥ జ్ఞానసంచయమొప్పెడి ఘనతనెంచి । సజ్జనావళి కాహ్లాదజనిత
మైన । కావ్యముగ జేసి యాబ్రహ్మకల్పములను ధాత్రి వ్యాపిం
ప । జేయుము దత్తమూర్తి॥

గీ॥ శంఖచక్రములును గద శార్ఙ్గకనుకు । దండములునారు భుజ
ముల దాల్చి నానపసుల పోషింతువని నమ్మి వాంఛదీర । చి
త్తములరగ ధ్యానింతు దత్తమూర్తి ॥

గీ॥ మంత్ర మంత్రార్థములు చెలంగుమంత్రమూర్తి । నిహితనమంత్ర
మటంచు నైవేదమంత్ర । పుష్పసమర్పింతు నాదగు పుణ్యమ
నను । దయ దలిర్పగ గొనుమ శ్రీ దత్తమూర్తి ॥

గీ॥ అక్షతాంధవళాకారమనెడిరీతి । నక్షతలను సర్పణము జేతు
నవధరించు । సంతసము నొందు నిగుణానసత్యతేజ । ధర్మ ర
క్షణ దైవము దత్తమూర్తి ॥

గీ॥ మత్త మాతంగ హయ సింహమాది వాహ । నములు ఛత్ర
ము వింజామర మకన్నృత్త । గీతవాద్యములెల్ల సంప్రీతిగా
గ । దాస దాసుఁడ సర్పింతు దత్తమూర్తి ॥

గీ॥ హంసతూలికగాను యోనాదిశేషు । ఫణులపై బవ్వళించెడి
భవవిదార । చెలువముమరగ నవరత్నదోలికందు । దయద
లిర్పగ నిదురించు దత్తమూర్తి ॥

గీ॥ నీవు నిదురించ లోకముల్ని ధులు నదులు । గ్రుంకుననియెడి
జ్ఞానంబు రూఢిదెలిసి । లోకముల [illegible] లక్ష్యములను ।
దలపులోన నెఱుంగుము దత్తమూర్తి ॥

గీ॥ ప్రకృతితోఁ గూడిచెరియుంచు ప్రజ్ఞ వెలయు । జ్ఞానమజ్ఞానమిం
ద్రియ ఘనతనిలిపి । హెచ్చుమతితోడ బలికెడి హెచ్చరిక
లు దైవరాయఁడ గనుమాన్కై దత్తమూర్తి ॥

గీ॥ భైరవాదిసమూహము ప్రమథగణము । వెంటనంటియుండు
డి విశ్వవిభుఁడ । మంత్రహీన క్రియాహీన మహితబాయ । ద
యచు నేటము సత్వర దత్తమూర్తి ॥

గీ॥ భక్తితోడమతనర్పించు పత్రపుష్ప । ఫలము తోయములనెల్ల
ను బహుళముగను । నెంచి బ్రోచెడి దైవము నీవెగాన । దాస
దాసుఁడ ననుగావు దత్తమూర్తి ॥



శౌనక మహాశయులారా!

సీ॥ బహుజన్మపుణ్యసాఫల్యులై సుకృతులై వేదవేదాంగాది వి
హితవిధులు । యజనయాజనములు నశేషపూజాది సిద్ధులు స్నా
నసంధ్యావాహులు జపసమాధులు । ధర్మతత్త్వపరతయు దానశీలంబు
లు సత్యంబు శాంతంబు శమము దమము । పుత్రపౌత్ర
లు పుణ్యసతుల్ ఘన విత్తవైభవములు విపులయశము ॥
గీ॥ భోగభాగ్యములెల్లను బొందగలుగు । భువిని శ్రీరామయచల
సంపూర్ణబోధ । యనుచు విబుధులు వచియించు యార్షవి
ధులు వ్రాసినాడను ప్రాజ్ఞత వర్ధిలంగ ॥

కథాప్రారంభము.

క॥ పలువిధవృక్షలతాదులు । ఫలపుష్పచయంబులొప్ప పక్షి
మృగాదుల్ । చెలువమున మైత్రిమెలగుచు । సలిలతముగనుం
డ నైమిశవనమలరగెన్ ॥

వ॥ అట్టి నైమిశారణ్యమున, నిఖిలపురాణ వ్యాఖ్యానము సెల్పు
సూతపౌరాణికునకు శౌనకాదిమహర్షులు గాంచిపలికించి శ్రీరామా
చలపూర్ణబోధని కథాశ్రవణకుతూహల సంజాతచిత్తులై, ఒకనాడు.

క॥ జేయు శౌనకుండాదిగ । వారలు సూతుని నుతించి వరగుణభ
రితా । శ్రీరామాచలమునగల । సారము దెలుపంగదయ్యా
సత్వాగతమునన్ ॥

క॥ వినిసూతుండుఋషులకు విధా । మనమునగల సందియమును
మానగ వేగం । బున శ్రీరామాచలమును । ఘనతత్త్వము దె
లుపువాడగని వినిసంతసన్ ॥

వ॥ మహాఋషులారా! సావధానచిత్తులై నాలింపుడు. సర్వభూత
ముల యందాత్మస్వరూపుడును, [illegible] ఆది
మధ్యాంతరహితుండును, అవాఙ్మానసగోచరుండును [illegible]

# శ్రీ రామాచలపూర్ణబోధిని.

కనాని శాసమేజగత్ప్రాప్తి. ఇదియే ఉపనిషద్వాక్యసారము. ఈ స్వయంప్రకాశమే సంపూర్ణబోధనే నెఱుంగందగు నచల బ్రహ్మము. బాహ్యవ బరము లేక శాశ్వతనిర్వాణమగు తేజము నెఱుగు మార్గమును, జీవసిద్ధి తెలుపును తెలియబలికితిని. ధన్యతనొందితివి. అని శ్రీమన్నారాయణుండగు నిర్గుణబ్రహ్మచే బోధింపబడెనని నే వినియుంటిని. ఓ మహర్షులారా! మీరీ విషయములు బోయుడు. అనిన సూతుని శౌనకాదులు మరల ప్రశ్నించిరి.

సూతమహర్షీ! ఇది యెవరికి తెలిసినది, యేయేరీతిగా వ్యాప్తి జెందినది. ఎవరెవరే యోగులీ సిద్ధిచే ధన్యత జెందిరని మాయెడ దయగలవారై తెలుపుమని కోరిరి. అనంతరము సూతుండు చెప్ప దొడగెను.

మహర్షులారా! బ్రహ్మదేవిని కొలిచినవారిలో అచలబ్రహ్మబోధ, వసిష్ఠ, వామదేవ, కణ్వ, బృహస్పతి, అత్రి మొదలగు తపోధనులు, పూర్ణబోధామృతపానరతులై నిజపదవి జెందిరి. ఆ యుబ్రహ్మ మొదలగు దేవతలును, విశ్వామిత్రాదులగు రాజర్షులును, మాంధాత మొదలగు మహారాజులును, మరియు సదేవులు, అచలబ్రహ్మానందమగ్నులై బ్రహ్మత్వసిద్ధి బొందిరి. సూర్యవంశపు రాజులకు కులగురువై యొప్పినాడు, వసిష్ఠుచే సూర్యవంశపు రాజులగు ఇక్ష్వాకు, ముచుకుందుడు, మాంధాతయను పురుకుత్సుడు, పురూరవుడు, అంబరీషుడు, సత్యవ్రతుడు, త్రిశంకుడు, హరిశ్చంద్రుడు, లోహితాస్యుడు, దిలీపుడు, భగీరథుడు, రఘుమహారాజు, అజుడు, దశరథుడు, శ్రీరాముడు, జ్ఞానవాసిష్ఠ, యోగవాసిష్ఠ, బృహద్వాశిష్ఠములను త్రివిధబోధలచే సంపూర్ణతనొంది శాశ్వతానంద దాయులయ్యారు.

సీ॥ అచల సంపూర్ణత నంతనే జెందియు

బ్రహ్మసృష్టిని జేయు బ్రాజ్ఞుడయ్యె ।

అచలసంపూర్ణత నామోదమున భృగు

శిష్యులకెరుగించ శ్రేష్ఠులైరి ।
అచలసంపూర్ణత కాహ్లాదమొంది
నిదాఘుడు సూర్యుండు ధన్యులైరి ।
అచలసంపూర్ణత కానందమగ్నత
పరశురాముఁడుజెందె ప్రతిభగాంచె ।
అచలసంపూర్ణత యాజ్ఞవల్క్యయుగాంచి
జనకుఁడాదిగ వారి ఘనతనిలిపె ।
అచలసంపూర్ణత ననుభవమున శుకుండా
నందబోధయె యచలమనియె ।
అచలసంపూర్ణత నరసఖునకుదెల్పి సాం
దీపుఁడైశ్వర్య సాధనమనె ।
అచలసంపూర్ణత యానందమయమని
శివరామయవధూతచెప్పియుండ ॥

గీ ॥ భువిని నరసింహ్మయవధూతబోధవలన ।
బఱగ గోపాలయవధూతపాలుగొనియె ।
గాన, సుజ్ఞానబోధనుగాంచువారు ।
భ్రాంతివిరహిత పదవినిబడయగలరు ॥

సీ ॥ దూర్వాసుకోపంబు దొలగించు ధీశక్తి
యంబరీషునకిట్టియశమునిలిపె ।
కార్తవీర్యార్జునుం డార్తరక్షణసేయు
బుద్ధినిల్పెను పరిపూర్ణబోధ ।
కార్యదీక్షను శౌర్యగాంభీర్యబలములు
విజయుడుగైకొన్న విమలయశము ।
ధర్మదేవతతాప తప్తతబాపంగ
ఉత్తరకొమరున కొప్పినట్టి ॥

గీ ॥ ఘనతలకుమూలమైన దిజ్ఞానబలము ।

నింతకన్నను దెల్పునదెద్ది లేదు। నిగుణ్త్రైశ్వర్య సంపద నేర్పగ నెడి
భక్తిజ్ఞానంబుగలుగును ప్రాజ్ఞులకును॥

సీ॥ శ్రీరామయచలమే స్థిరమైనసంపద
శాశ్వతానందమౌసత్యయశము।
శ్రీరామయచలమె సురచిరవిభవంబు
మాయనుదోలంగించు మహిమ నెలవు।
శ్రీరామయచలమే సారవిహీనమౌ క్రూ
రసంసారంబు గూల్చుశరము।
శ్రీరామయచలమే శ్రేయమౌబ్రహ్మంబు
సాయుజ్యమును జేరుసాధనంబు॥

గీ॥ యనుచు విష్ణుండు బ్రహ్మకు యానతిచ్చె।
నట్టి సుజ్ఞానభావంబు నరయు వారు॥
నిర్గుణబ్రహ్మపదవిని నెలవు గనియు।
సచ్చిదానందమును గాంచు సౌఖ్యమొదవు॥

సీ॥ వేదార్థతత్వ వివేకంబుగలిగిన, భ
క్తిభావంబును పరిఢవిల్లు।
అందున సుజ్ఞాన, మందున వైరాగ్య,
మందున సాయుజ్యమబ్బు మరియు।
సారూప్యమునుఘన సాలోక్యపదవియు,
శాశ్వతానందంబు సంభవించు।
సంతతసౌఖ్యమై జన్మరాహిత్యమై బ్ర
హ్మంబుతానైయె ప్రతిభ వెలయు॥

గీ॥ గాన సుజ్ఞాన భావంబు గలుగునట్టి।
సత్యమౌ నామహితమును సరకుజేసి।
మూలకారణభూతుని మోదమునను।
పూర్ణబోధామృతంబున బొందరయ్య॥

# త్రిశంకుచరిత్రము.

సీ॥ పరిపూర్ణబోధను బ్రహ్మచేతవశిష్ఠు । బొందియుత్రివిధంబు పొసగజేసి । యందునసెక్కటి యవనీశుడొప్పుదు । కుత్సునకునుదెల్ప గురుడునగుచు । వారివంశంబున వసుధపైజన్మించు । పురుషులనెల్లను బోధజేసె । నందుసత్యవ్రతుండను వానిసుతుడు త్రిశంకుండు సాత్వికచక్రవర్తి ॥ గీ ॥ సత్యధర్మంబు శాంతంబు శమదమమును । గలిగెదద్ధర్మయుక్తుడై జ్ఞానమునను । రాజ్యపాలనసేయుచు రాజులెల్ల । కప్పములు నర్పణముసేయ ఘనతగాంచె ॥

పంచపాదిగీతం ॥ పరగకోసలకును ముఖ్యపట్టణముగ । వరన, యోధ్యాపుర వరమువన్నెకెక్క । పరమసాధ్వి యగుసత్యవ్రతమహిషి । సద్గుణంబులపతిచర్య సలుపగొనుచు । సంతతియులేని చింతచేజగతి నేలె ॥ వ ॥ చతుస్సముద్ర ముద్రిత ధరామండలంబునఁ గల నిఖిలఖండములలో సకలసంపత్పరిపూర్ణంబగు భరతఖండమున.

శ్లో ॥ అయోధ్యాను మహత్పుణ్యా । రాజధానీ బభూవహా । మానవేంద్రేణమనునా । యాపురీ నిర్మితాస్వయం । సరయూదక్షిణేతీరే విచిత్రతరుశోభితే । స్థితాసానగరీహేమ ప్రాకారపరిశోభితా ॥ అగాధతోయపరిఘావిచిత్రమణిగోపురా । చిత్రధ్వజపతాకైశ్చైతో రత్నైరుపశోభితా ॥ ప్రాసాదహర్మ్యసౌధాద్యై రుపకార్యాభిరుజ్వలా । శృంగాటకశతాక్రాంతా చత్వరైర్ధారితు చిత్రితైః ॥

అనుకీర్తిగ సర్వమంగళాభ్యుదయనివాసంబై హిమమహీధరంబుపోలికను - ధర్మాస్పద రూపరమ్యంబై శ్వేతద్వీపంబు కరణిఁబుణ్య జనానంద సమృద్ధిదంబై. అలకాపురంబు లీలను నవనిధియుతంబై వరుణపురంబుపోలిక రాజహంసాభి శోభితంబై అమరావతీ పట్టణంబు చాడ్పున విబుధ జనమనోరంజనకరంబై పద్మాకరంబు వైఖరిఁ జతురాస్యవాణీ ప్రచురంబై సత్యలోక వైకుంఠ కైలాసము లా

క్కచోఁగూడి యుండినవో యనునటుల - బంగారు ప్రాకారములు - నభ్రంకషములో యనఁదగు సౌధములు - మంత్రులకనునగు కక్ష్యములు - పురోహితులకుఁ దగుగృహములు - అశ్వరథ గజశాలలు - మెరుపుతీగెలభాతి ప్రకాశితంబులగు మణిమయి మంటపములు - విచిత్రతరు. చిత్రితములచేనొప్పు - అంతఃపురములు - తరులతాదులచే నిండి. ఫలపుష్పభరితంబైయొప్పు. వనములు - చల్లని తేట తియ్యనీరుగల కాసారములును - మయూరము లిరుప్రక్కల నాణిముత్యములు నోటగఱచుకొనియుండ నమము రత్నఖచితమగు, సింహాసనమును, కడు రమ్యముగా భాశిల్లుచుండెను - అప్పురవరమునందు,

గీ ॥ వేద వేదాంగ తత్వార్థ వేత్తలగుచు । జప తపాదులు యజ్ఞములెసైనవాజ । పేయమును జేసి సద్ధర్మ విహితమునను । పరగసంపత్సమృద్ధు లౌబ్రహ్మవిదులు ॥

గీ ॥ బాహుబలశౌర్యధైర్యంబు ప్రౌఢినొప్పు । శీలసౌందర్యసౌజన్యశ్రేయములను । క్షత్రియోత్తములనెడి విఖ్యాలుపమతులు । వేడుకలరగ నుండి రప్పేటియందు ॥

గీ ॥ ధనసమృద్ధియు వ్యాపారతత్పరతయు । సత్యవర్తనదానంబు స్వకుల శీల । ములును, విద్యావివేకత పుణ్యయశము । భక్తివైరాగ్యములుగలవైశ్యవరులు ॥

గీ ॥ పరగమోటాటి గూడాటి పాకనాటి । మొదలుగాగల కాపులుమోదమలర । పంటలధికంబు గోవృషభములుపెక్కు । గలిగి. విద్యావివేకులైఖ్యాతిగనిరి ॥

గీ ॥ హరిసేవాద్యర్చనలును । హరిభక్తియు కీర్తనములు నచలార్థంబుల్ । గురు తెలిఁగినసుజ్ఞానులు కరమురుదుగ । పెక్కుమంది గలరప్పేటిక ॥

క ॥ బీదలు లేరాపురమున । సాధువులును పెక్కుగలిగి సంభావితులై। మోదమునరాజుకృపగొని । సాధించిరి యోగములను శాశ్వత పదవుల్ ॥

గీ॥ రెండుదండకమండల యోగమాల। వ్యాఘ్రచర్మంబు భ
స్మంబు బరగదాల్చి। పరమహంసలు బ్రహ్మైక్య భావప
రులు। సంతసంబున కాలంబు జరుపుచుండ్రి॥

గీ॥ పరగయవధూత భావంబు పరిఢవిల్ల। సచ్చిదానంద పరబ్ర
హ్మ సత్యమనెడి। బోధనలు సేయు పుణ్యులప్పురమునందు।
గూడియుండిరి దమతమ కోరికలర॥

గీ॥ తాళరాగ స్వరమ్ములు దప్పకుండ। భరతనృత్తంబు లందు
న ప్రౌఢులగుచు। కాలగతుల నివేదించు జ్ఞానమొప్ప। గా
యకావళి బహుమంది గలరుఘనులు॥

ఉ॥ పాలనశీలమున్ విమల భారములాదిగ నొప్పిపృథ్విని న్। పా
లనసేయు భూపతియు భానుకులంబును వాసిజెందవా। చా
లతవిద్య ప్రోడిమలు శాంతసుధీరులు రాజకీయమున్। జాలి
నయుక్తియుక్తముల జర్పెడువారగు మంత్రిశేఖరుల్॥

క॥ ఈతెలు మొదలగు శరములు। సూటిగధరియించి మన్నెసు
ల్తానులనన్। సీటుగల వెలమ దొరలే। ర్పాటగు కప్పములని
చ్చి బడసిరి యశమున్॥

క॥ నియమిత కప్పములిచ్చుచు। భయభక్తులు మెలగికమ్మ వం
శజులిలపై। నయమున రాజవరేణ్యుని। జయగొని తమధర్మ
ములను దనిసినవారల్॥

గీ॥ రెడ్డిక్షత్రియ దొరలు సుస్థానులగుచు। బాహుబల శౌర్య
ధుర్యులై ప్రబలనైజ। కార్యములయందు మంత్రుల కనువు
గాను। యోచనలుచెప్పి పనులందు నొప్పిమరియు॥

ఉ॥ కొందరు న్యాయమూర్తులును కొందరుసైన్యపు దండనాథు
లున్। కొందరు న్యాయవాదులును కొందరు రాజులు గాను
యొప్పియా। నందము సందడింపజన నాథునిమెప్పును గాంచి
భూజనా। వందితులౌచు దేశముల వాసివహించిరి రెడ్డిక్షత్రి

యుల్ ॥

వంది మాగధులును, సుకవులును - గజహయబలములును - పటాతు లును - గలిగియుండెను - మరియు. త్రిమతములవారు మతద్వేషులు గాక - దైవరాజ భక్తిచే - ప్రజానురక్తిగల త్రిశంకు చక్రవర్తిని పొగడు చుండిరి । రాజచంద్రునిచే నియమింపఁ బడిన - పాఠశాల లనే కములు గలవు. అందు వైష్ణవ సాంప్రదాయ బోధనా శాలయందు నీ క్రిందివిషయముగ బోధింపఁ బడుచుండెను ॥

"దేవపాయే విభూతేన బాహునాసుదర్శనేవ ప్రయతమాన స్సో
లోక సృష్టింవితన్వతి, బ్రాహ్మణాస్త ద్వహంతి. అగ్నినావైత స్తం
ద్విభుజేధారయన్" ॥ శతపథ బ్రాహ్మణము-
చక్రమా దాయాగ్నౌ ప్రతప్య బ్రాహ్మణస్య దక్షిణేబాహౌ
ధారయేత్ ॥ యఃపాఞ్చ జన్యమాదాయాగ్నౌ ప్రతప్యబ్రా
హ్మణస్యోత్తరబాహౌ ధారయేత్ ॥ అథర్వణవేదము బృహ

దారణ్యము మొదలగు వానియందు చెప్పినవోప్పాన, చక్రధారణము ను, "ధృతోర్ధ్వపుండ్రం పరమేశితారం, నారాయణం సాంఖ్యయో గాధగమ్యం. జ్ఞాత్వాదిముచ్యే తనరాస్సము స్తైస్సం సారపాశైరిహచై వవిష్ణుం ॥ మహోపనిషదు నందును, అథర్వణ వేదమునందును, క ఠోపనిషత్తు మొదలగు, శ్రుతిస్మృత్యాదులయందు, మార్కండేయ పురాణముల యందును, వర్ణించిన విష్ణు, కేశవ, నారాయణా, మాధవాది రెండునామములు, విష్ణులాంఛనములు గల, ఊర్ధ్వపుం డ్రములు ధరించినచిన్హయై, నిర్మలహృదయులై, "ఏకోవిష్ణుం మహ ద్భూతం,, నద్వైతం కేశవాత్పరమ్,, సర్వంవిష్ణు మయంజగత్,, అ ను వాక్యార్థములు, బాగుగా గ్రహించిన వారలై, జ్ఞప్తియందుంచు కొని, పరమభాగవత శిఖామణులై.

మాటి మాటికి శ్రీమన్నారాయణా యను నామముచ్చారణ సేయు చు, శఠగోపస్తవము, శ్రీగుణరత్నకోశము, ముకుందమాల, అష్టశ్లో

కి, చరమశ్లోకి, ఆళవందారు స్తోత్రము, తిరుపాయిముడి, తిరుమంత్ర ద్వయచరమ శ్లోకములు, నాలాయిరం మొదలగు, ద్రావిడ ప్రబంధ ములయందును, తర్క-వ్యాకరణ, కావ్యనాటకాలంకారనిపుణులై, వేదాంతార్థములు, ఉపన్యసించుచుండు, వైష్ణవోత్తములును, వారి శిష్యబృందములును, విష్ణ్వాలయమునందు, నియమించిన పాఠశాలయందు, సాంప్రదాయాను సారముగ, పఠించువారలై యుండిరి.

మరియు. శైవమతధర్మము లాపట్టణమందెటువలె నుండెననగా.

శ్రు ॥ సర్వలింగగ్స్థాపయతిపాణిమంత్రం పవిత్రం ॥ ఈప్రకారము లింగధారణకు వేదమునందు ౩౨ మంత్రములుగలవు.

శ్లో ॥ ముఖేమంత్రం హృదిధ్యానం, మస్తకేలింగధారణం, శిఖా సూత్రం తథాభస్మ వితద్బ్రాహ్మణలక్షణం ॥ అనుకీతిగా భస్మలేపనమును, రుద్రాక్షమాలికా ధారణమును సేయుటముఖ్యము. అట్టివారలు లింగైక్యమై, పుణ్యలోకమును జెందుదురు.

శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణాపత్య, కాపాలమతము లాదింటిలో శైవమతము, ఆదిమతము, అందుచే సర్వమంత్రములు, వేదములు, పంచాక్షరియందున్నవి.

" తత్పరంబ్రహ్మేతి సయేకోరుద్రస్స ఈశస్యభగవాన్ । సమహేశ్వరస్సమహాదేవ "విశ్వేశ్వరాయ, మహాదేవాయ, అనుశ్రుతి యాధారమున సర్వదేవతల కాధారభూతుండగు సదాశివుడు.

జలంవా పుష్పమేకంవా । లింగస్యోపరి నిక్షిపేత్, అమంత్రం వా సమంత్రంవా కులకోటిం సముద్ధరేత్ । పూజయాభక్తిమ శ్నుయాత్ పూజాయా ముక్తిసంభవః ॥ పూజయాసదృశో ధర్మోనాస్తి లోకత్రయేష్వపి । మాన్యాత్కృద్ధో పిసాకాశం । సదృశం నాస్తియేద్విషం । త్యక్త్వా లింగార్చనం మూఢోము క్త్యర్థం త్రితయంతథా ॥ అను గరుడపురాణమందు చెప్పినచొప్పున, నీటిచేతను, పత్రపుష్పముల చేతను మహాదేవుని పూజించిన

ముక్తిగలుగును - రజ్జువునందు సర్పభ్రమనుపొందినట్లు, శుక్తియందు రౌప్యభ్రమ పొందినట్లును, మహాదేవుని మాయచేత జగద్భ్రమ కలుగుచున్నది. శరీరమందు లింగమునుధరించియు; పరలింగైక్య సమర సానందము తెలియక, కాశికాది క్షేత్రలింగ ధర్మాపేక్షితులై పోవుదురు.

గీ ॥ కాయపోషణంబు గంగానదీస్నాన । మాదిగాగగల్గు సకలశౌచ । ములనుదేహవాసనలు మూఢుడగువాడు । తగిలిసదము చుచుండు ధర్మచరిత ॥ (శ్రీరామస్తవ)

శ్లో ॥ శివస్యాజ్ఞాబలాద్విష్ణు ర్జాయతే బ్రియ్యతేపిచ । బ్రహ్మాస్స ర్వజగత్కర్తా విరాట్సమ్రాట్స్వరాడపి ॥ అనునటుల సృష్టి స్థితిలయముల కాధారభూతుడు యీశ్వరుడు.

కాలాగ్ని రుద్రోపనిషత్తు, కూర్మపురాణము మొదలగు గ్రంథముల యందు చెప్పినశోధ్యాన భస్మరుద్రాక్ష ధారులై శ్రద్ధతో శివధ్యానము, శివపూజ చేయుచుండిన సర్వఫలములు, లభించి, అంత్యమున ముక్తికి జేరగలుగుదురు, పత్రములు, పుష్పములు, గరక, ఉదకము, మొదలగువానిచే, లింగపూజగావించి పిదప భుజింపవలయును.

"లింగంపూజ యిత్వానిత్యం, మహతీం శ్రియమశ్నుతే,, అనియును, "చేతులారంగ శివుని పూజింపడేని,, అనువచనములు వృథాసేయక పూజింపవలయును.

సంపత్కరము, పాపహరము, నరకనివారకము, పరశివ ప్రాపకమునగు భస్మధారణము మరువకూడదు.

అనిబోధించు శైవములు లొప్పియుండిరి.

సీ ॥ స్థానత్రయంబుల సంగత్రయంబుల బంధత్రయంబుల బారదోలి । జీవత్రయంబుల చిత్త్రత్రయంబుల బింబత్రయంబుల డిందుపరచి । దైవత్రయంబుల తాపత్రయంబుల యీషణత్రయములదోషముడిపి । కర్మత్రయంబుల కారణత్రయముల

వాసనాశ్రయముల వడినిఁద్రోచి ॥
గీ ॥ యుండుపరమాత్మ గనువారలుర్విలోన । బాహ్య సంసారమె ల్లను బయలు జేసి । ముక్తికాంతను మదిలోన ముక్తి నొందుదు ! రనుచు శిష్యులకు బోధించునట్టివారు ॥ (శ్రీరామస్తవం.)
క ॥ మాయయను జోడుగొడుగుక । కాయంబను రథము నెక్కి కర్మములింట । న్యాయాగ నాశాబాణో । పాయంబున జి త్తరాజు పడుమడి వేశ్క ॥ (శ్రీరామస్థవం.)

వేదాంత శాస్త్రంబుల నిరామయ నిరాభాస - నిర్వికల్ప - నిష్ప్ర పంచంబైన - సనాతన బ్రహ్మాచిదంశంబున, రజ్జుశుక్తి - స్థాణువులు లేని యహిరజత చోరాద్యారోపణ లెట్లట్లు తోచిన - మాయాప్రపం చంబు - దబ్బరగుటం జేసి - సంవిన్మాత్రుండై జీవుండు తన్ను దాంటె లిసిన ముక్తుండగు - మాయానుబంధమంబున తన్నె ఱుంగమి జేసి బ ద్ధుండగు. నీబంధముక్తులు నాత్మకు వేఱు సంకల్పస్వభావంబనువారును యాత్మ సాక్షాత్కారపరులైన కారణగురుండు శక్తిని పాతసమయం బున దోఁచుననువారును, కర్మముక్తులు మహాసంకల్ప భోగంబులఁ గల దనువారును, సద్భక్తినిఁగాని యీశ్వరానుగ్రహ జ్ఞానంబులు లేవను వారును, శివాద్వైత, క్రియాద్వైత, ద్రవ్యాద్వైత, శుద్ధాద్వైత, మ హాద్వైతులును, - రెుప్పచుండెను,
సీ ॥ వేదాంతవిదులైన విద్వత్సమూహంబు నుభయభాష కవిత్వ ము చెప్పుకవులు । సకలాస్త్ర బాంధవ సంబంధవర్యులు వింజా మరలువీచు వేడ్కభటులు - నీతికోవిదులైన నెరమంత్రివర్గం బు రణరంగశూరులౌ రాజభటులు । సంగీతసాహిత్య ఛంద స్సునాదిగ షడ్శాస్త్రపూర్ణులౌ శాస్త్రవిదులు ॥ గీ ॥ వం దిమాగధపరిజన బృందములను । బలసికొలచెడి నతుల వైభ వముగలుగు । చావడియునీడి యేకాంతస్థలమునందు । కులగు రునితోడ నిట్టుల బలుకదొడగె ॥

గీ॥ కొమరులును లేకయుండిన కొదువయొకటి । హృదయసీమను
తాపంబు గదసియూడ । తాపసోత్తమ నేనెటు తాళగలను ।
రాజ్యమేలను ధనమేల రమణులేల ॥

వ॥ అని పలికినంతనె వసిష్ఠమహామునీంద్రుడు చిఱునగవు నగుచు మహారాజా త్రిలోకాధిపతిని పరిహసించందగు వైభవోపేతుడవై సకలసంపదల నొప్పియుండు నీకీచింతయేల తఱుణావయస్సున కామాది భోగముల ననుభవించి పిదపగదా నీవంశీయులు సంతతికై యోచింతురు ఆర్ద్యానిసివిడది నీవు రాజ్యసుఖంబులు ననుభవింపుము అనిపలుక త్రిశంకుండు ముకుళితహస్తుండై ఇట్లనియెను. గురువర్యా రాజ్యాంతే నరకం ధ్రువంబనియుండుట మీరెరుంగనిది కాదు.
రాజ్యసన్మానములు జంత్రపు ప్రతిమలవలె ప్రకాశించునవి యెగదా. సార్వకాలము రాజ్యభారమునందే కాలము గడుపుచుండిన యెడ నేను తరించుమార్గమును గనుగొనుటెప్పుడు, మాయాప్రపంచమున, సంసారంబను తగులంబునబడి, కామ మోహాదులకు లోనై మెలంగుచుండుట సమంజసమగునే! మాపూర్వులవృత్తాంతము కొంత తమవలన వినియుంటిని. అయ్యది మఱపుజెందితిరని నెంచితిరి కాబోలు?

సీ॥ వాంఛితమీడేర పరిపూర్ణబోధను గావించపుడమి నీకరు
ణవలన । యశముగైకొనియుండు యఱుణమహారాజవంశ
మునందున వాసిగనగ । యజ్ఞయాగాదులందధిపుడై వరసత్య
వ్రతునకు సుతుండనై వరలుచుండ । కృపతోడసలపైన కీర్తి
నివంశంబు పెంపొందగా చేయు ప్రేమవీడి ॥ గీ ధనము రాజ్య
ము తనువులు తరుణులెల్ల । సౌఖ్యమని బల్కుచుంటిరి సం
యమీంద్ర । నీకు లెట్టులదోచెనో నెరుగజాల । తాపసులకిట్టి
కఠినంబు దగునజెప్పుడి ॥

గీ॥ భవ్యచరితుడ సాకేతపట్టణంబు । పరమసాధ్వి శ్రీ యనునట్టి
పట్టమహిషి । షడ్గుణంబుల పతిచర్యసలుపగొంటి । గానశా

శ్వాతసద్గతి గలుగుటెట్లు ॥

వ ॥ ధనము తనువు రాజ్యము శాశ్వతమగు పదార్థములు గావని నిశ్చయించుకొనవలయును.

శ్లో ॥ కామక్రోధౌచ లోభంచ దేహేతిష్ఠంతి తస్కరాః । జ్ఞానరత్నాప హారార్థే తస్మాజ్జాగ్రహి జాగ్రహి ॥ అనియును.

శ్లో ॥ అర్థానా మార్జనేదుఃఖ । మార్జితానాంచ రక్షణే । నాశే దుఃఖంవ్యయే దుఃఖం అర్థస్యై పకుతస్సుఖం ॥ మరియు ధిగర్థం దుఃఖభాజనం బనియున్నది.

సీ ॥ కామక్రోధాదిమహాతర శత్రువర్గప్ర తాప ప్రధానసా ధనము ధనము । సకలావగుణపుంజ సంశ్రయాకారూప కారణగళ బంధనముధనము । జన్మపరంపర సంసార కారణ ఘనకర్మ జాల వర్ధనముధనము । కైవల్యసంప్రాప్త కారణవైరాగ్య ధర్మమార్గార్గళ విరోధ ధనముధనము ॥ తే ॥ గీ ॥ గలిగిగర్వం బుచేటికి దుఃఖంబుమదికి । వెనుమునజ్ఞాన పావకేం ధనముధనము । స్వప్నలబ్ధపదార్థంబు చందమునను । దలచిజూడంగ నట్టిదంధనముధనము ॥ —— అని పురూరవచక్రవర్తి మహాత్రితో జెప్పినటువిని యుండమే. ఇంతేగాక క్రోధుండు లోభుండు మహామోహుండను, మువ్వురుసోదరుల వెంటనిడుకొని కామదేవుడు, మలయానిలయును, వసంతుడును, చంద్రకళయగు పండువెన్నెలం పుష్పములు, స్త్రీలును, మొదలగు పరివారముతోంగూడి ప్రపంచమును రాజ్యమునేలుచు, సత్యవంతులను, వివేకులను, తమమహిమకు లోబఱచుకొనును.

తక్కుంగల మద, మత్సరాదుల ప్రతాపము, వర్ణింపనలవియె కాదు గద. మరణాంతమువరకు తృష్ణాలోభుల ప్రతాప మడంగుటమగద. కాముని కృపాకటాక్ష ప్రసారముగల్గెనేని, నేర్చినవిద్య మఱచుట. కన్నులుండి, మంచివస్తు పరిజ్ఞాత గలుగకుండుట, జూడకుండుట, చెవు

యుండి, హరికథాశ్రవణమాది మంచిమాటలు వినలేకుండుట, గజతు
రగాది వాహనములును రాజ్యము మొదలగు ధనము, వైభవము నెంత
యున్నను తృప్తినొందకుండుట. అహంకార మమకారములనుగంటిపో
కుండుట. గలుగనీయదుగద. సురీయు కన్ను విప్పునగానం " కామా
తురాణాం న భయం న లజ్జా, అను మాటలు.
శిగ్గు, భీతి, లేక స్త్రీలోలత్వమునకు, కారణమగుట, సంభవించును.
తరుణీయనగా, శ్రోత్రేంద్రియమునకు, వినదగు శబ్దము, త్వగింద్రియ
మునకు స్పర్శము, ఘ్రాణేంద్రియమునకు గంధము, జిహ్వేంద్రియము
నకు రసము, చక్షురింద్రియమునకు రూపము, ఈవైదింటి శోభకూడి
న, సమష్టిరూపము చేత, బుద్ధిని చిత్తము, నపహరించుటవలన, త
రుణి యనంబడియెనుగద. అట్టి స్త్రీరూపములు,

శ్లో ॥ నారీస్తనభర నాభీదేశం । దృష్ట్వా మాగా మోహావేశం । ఏ
తన్మాంస వసాదివికారం । మనసి విచింతయ వారంవారం ॥

అనియును.

క ॥ చన్నులు మాంసపుముద్దలు । కన్నులు దాగ్జలము ఫుసులు గా
రెడుతోరటల్ । వెన్నులు యెముకలపాతర । లన్నులునివి చెల
సివలచుట విశేషమెకా ॥ అని పురూరవుండు వచింపలేదా ।

శ్లో ॥ కురంగమాతంగ పతంగభృంగ । మీనాహతాః పంచభిరేవ
పంచ ॥

చ ॥ వనకరిజిక్కె మైనెసకు । వాచవిచేన్ జెడిపోయెమీను, తా ।
వినకరిజిక్కె చిల్వ్కకను వేమురజెందె నుసిష్ఠాావిలో । ముని
గినశించె తేటితరమా నిరుమాటిని గెల్వ నైమసా । ధనము
లుగెల్వవివెకద । దాశరథీ కరుణాపయోనిధీ ॥

శబ్దముచేత చాతకపక్షి మేఘధ్వనివిని, జలపానముచేయుటకు పై
కెపోవునెడల భూమియందవి శబ్దమునువిని, మేఘధ్వనియనివలంచి
క్రిందంబడిచచ్చును.

స్పర్శనుచేత కిరాతకుఁడు పల్లముత్రోవ్వి దానిమీఁదపచ్చికను పైపరపెట్టి, దానియెదుట, ఆడఏనుఁగను గట్టినదాని స్పర్శము, నపేక్షించి, మొగఏనుఁగు, పల్లములోఁబడి చిక్కుబడును.

గంధముచేత భ్రమరముకొలను యందుగల, పద్మములోనుండెడు తేనెకాశించి, అందులోచేరి పద్మము, ముణింగిపోవునెడ, తానును మునిఁగి, జలములోఁ బడిచచ్చును.

రసముచేత మీనము, జాలరుడు వేసిన, గాలమునందలి అల్పమాంసమున కపేక్షించి ఆగాలమునుమ్రింగి, మృతినొందును.

రూపముచేత మిడత, దీపమును, పండని భ్రమించి, మ్రింగఁబోయి, అందులోఁబడిచచ్చును.

ఈప్రకారము, ఒక్కొక విషయమునందే, ఆయాజంతువులు, మృతినొందుచుండగా.

స్త్రీయందలి పలుకులకును, స్పర్శమునకును, గంధమునకును రసమునకును, రూపమునకును పురుషులువశపడి నశింపకుందురా.

మాంసము, వసకొవ్వు, రుధిరము మొదలగు, మలిన పదార్థములొప్పు, స్త్రీలయందసూయతజెందక, ఎన్నిదినములు, భోగించినను దృప్తియు సరియగుమార్గము నగుపడునే.

ఉ॥ చక్కెర పూతబూసిన విషంబులుభామల వాక్య వైఖరుల్।
చక్కగ వెన్నమెత్తిన శిలల్ విరిబోడుల చిత్తముల్ మణుల్।
జెక్కిన సంకిలల్ సతుల చేష్టలు కొమ్మల నమ్మవచ్చునే। అ
క్కట మేకవన్నెపులు లంగన లెన్నిట నెంచి జూచి నన్॥

శ్లో॥ ఔదుంబరాణి పుష్పాణి। శ్వేతవర్ణంచవాయసం। మత్స్యపాదం జలే పశ్యేత్। ననారీ హృదయ స్థితం॥

వ॥ మేడిపువ్వును, తెల్లనికాకిని, జలమందు చేపయొక్క పాదమును గనుగొనుట గలిగిన గలుగవచ్చును. గాని స్త్రీల హృదయమును గనుగొనగలరే?

గీ ॥ మూత్రపతన స్థలంబు బవిత్రమనుచు । ద్రొక్కరానేల గని
రోసి దొలఁగుచుందు । రట్టి మూత్రపు కాలువ దైన దోని
యోని దానికి రోయ దీయుల్ల మనఘా ॥

వ ॥ రుధిరము, మలమూత్రముచే, నిండి లోనుండి వెడలుటయే
యేహ్యముగానగుపడు చుండెడిదియు, నైనవస్తువు నపేక్షిం
చి మోహమునఁ బడి మాయాలోలుఁడై చచ్చుచు, పుట్టు
చు, గర్భనరక మనుభవింపుచుండ వలసినదేగద మతిభ్రమ
చేత శాశ్వత సుఖదాయినిగ నున్నట్టు భావించుటయే గాని
కసవుకొన నున్న నీటి చుక్క చందమున సందేహాస్పదముగ
లదియే గదా దేహము నీటిబుగ్గ సంపదలు మెరుపులు సుఖ
మణు మాత్రము దుఃఖము పర్వతము నిత్యము మృత్యుప్రే
రితమై కాలచక్రము ఉశ్వాస నిశ్వాసల చేత క్షయించుచుం
డు ఆయువు అపార తరంగములు గలసంసార సాగరము ష
డ్రసోపేతములగు పంచభక్ష్య పరమాన్నములు జిహ్వాచా
పల్యమున కనువగు, రుచులు హంసతూలికాతల్పములు, ర
త్నభూషణములు - రుద్రాక్ష తులసీసరులు - కస్తూరీ తిల
కము చందనము భస్మోర్ధ్వపుండ్రములు అధికార గౌరవము
మొదలగునవి - ఇంద్రియాదుల యొక్క అలంకారమున క
నువగు చిత్తవైకల్యములేగద ఇవి యవి యననేలా - పోనిం
డు. అశాశ్వత మగు వానిలోనైనను సంతోషదాయకము
గా నుండవలదా ? మనుష్యులకు మనస్సే బంధమోక్షము
లకు కారణమై శబ్ద స్పర్శాది విషయములయందు అశక్తము
లకు ముఖ్య కారణముగద కార్య కరణ సంఘాతాత్మకము
లైన జీవులు జన్మించుటకు పూర్వము అదృశ్యులుగాను జ
న్మాంతరమువిడిచినది మొదలు పుట్టిమరణ మయ్యెడిపర్యం
తము - నడుమ నుండెడి మధ్యకాలమునందు - దృశ్యులుగా

ను - మరణానంతరము - తిరిగి అదృశ్యులుగానగు చున్నార
ని పురాణ ప్రసిద్ధముగద భూలోక భువర్లోక సువర్లోక ములు
నివాసులు - అమృత పానముజేసిన వారైనను - ఉదకములు
చే పూర్ణముగా నిండియుండుసముద్రములును, దేవతలేగాక
రాక్షసులును, ధృవుఁడును, నక్షత్రములును, హరిహరబ్ర
హ్మాదులును, కాలము ప్రాప్తించినప్పుడు, నశించెడివనుట
దృఢమైనను, యేవిధమైనకోఱతలేక, నశింపుకాలమాసన్న
మగువఱకు, విషయానందమగ్నులై యుందురుగద!

అట్టివి నాకులేక గొప్పకోఱతగలిగియుంటినిగద. ధనము, రా
జ్యము, శృంగారసౌధములు, హంసతూలికాతల్పములు, హయగజాం
దోళికములు, దాసదాసీజనబంధు మిత్రమాత్యవర్గములు గలిగి
వానికన్నిటికి వన్నెబెట్టుసంతానమను, కొలికిపూసలేక, మొగమున
కుముక్కును, ఆకసమున రోహిణీకాంతుఁడు లేనిరాత్రి, పతిలేనిస్త్రీ,
పుడమీశుఁడులేనిరాజ్యము, వన్నెకెక్కని కావ్యము, నెంత ప్రకా
శహీనమైయుండునో యారీతి భాసిల్లుచుండెనుగద మూఁడుగాళ్లముస
లియగువిధాత ముదిమిచే మదితప్పి వ్యత్యస్తకార్యములు పెక్కులు,
యెల్లప్పుడు జేయుచుండుననుట దృఢపడెను. ఎటులనగా, నవమోహ
నాకారుఁడగు పురుషునకు గురూపిని భార్యగాఁజేసి దంపతులలోకల
తబెట్టుచుండును. జవ్వనియు సురూపియు గుణవతియు నగుస్త్రీకి కడు
వృద్ధుని భర్తగాఁజేసి యవ్వనలక్ష్మిని భంగపరచును. ఇల్లిల్లుదిరుగు
చు వ్యభిచరించువానికి, పరమపతివ్రతాశిరోమణిని సతిగాసమకూ
ర్చును. శాంతస్వభావునకు గయ్యాళిగంపను గట్టిబెట్టును. లోభికి ధన
మిచ్చును. దాననిరతుఁడగువానికి ధనమీయకుండును. భగవద్గుణాను
వతులు, బ్రహ్మనిష్ఠాగరిష్టులకుదారిద్ర్యము- పెక్కుసంతతి నొసఁగును.

ఉ॥ అన్నముగల్గువారికి దయామతి సంతతినీయనోపడా। పన్న
తనొండిసట్టి తినబట్టయు నన్నములేనివారి క। భ్యన్నతరీతి

సంతతిమహోన్నత సంఖ్యనొసంగు వర్ధువర్ధన్నను పొడు
నైవమహాహా । యతడెంతటి కొంటెవాఁడకొ ॥(వా ॥ వి ॥)
నేనెంత విలపించిదూరినను ప్రయోజనమగుపడదు. ఒకానొకప్పుడు,

శ్లో ॥ వృక్షైకంచసమారూఢ । నానాజాతి విహంగమాః । ప్రాత
ర్దశదిశోయాంతి కాతత్ర పరివేదనా ॥

అను నటుల యెక్కడివారలక్కడికి పోవుచుందురనుట నిక్క
వమేగాని కుణముసేప్పైనను గలసి మెలసి సుఖులై సంతోషమును
బొందుదుముగద! ఇంతేగాక,

చ ॥ కొడుకులుగల్గుదాక నొకకొన్నిదినంబులు చింతనందనుల్ ।
వడమిన నాయువుంబలము విద్యయు బుద్ధియు చాలగల్గుగా
నుడుగనిచింతగల్గి తనునోపి భజింపని చింత తండ్రికెప్పుడు ।
కడుచింతసేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే ॥

కంటబడిన దేవతలకు మ్రొక్కి సంతానముగని వారలకు వి
ద్యాబుద్ధులు గలుగవలయుననియు, సకలగుణములనొప్పి తనయాజ్ఞా
నుబద్ధులై మెలంగవలయుననియును, చింతనుండును. ఇవియన్ని నొప్పి
యుండినను తనహితవున మెలగని వాడైనయెడ ఆమరణాంతముతీర
నిశోకము గలిగియుండుననుట నిక్కవమ్మేయైనను, ధరణీపాలనము సే
యుచుండు నేను జాతము- నామకరణము- అక్షరాభ్యాసము- చౌలో
పనయనము- వివాహము- మొదలగు శుభకార్యములనునవి మురిపం
బు పెంపున నింపుగలుగు బిడ్డలకల్లారుముద్దుగా సలుపుటకునోచనైతి
నిగద! సంతానమో సంతానమని పేరాసలచే కలవరించుచు నేనెన్ని
యోనోములుసలుపుచు సకలదేవతలకెల్ల మ్రొక్కుచు- గ్రహశాం
తులు- దానధర్మములు- నవగ్రహజపంబులకు ధనము కొల్లబెట్టుచు-
ఫలంబుగానక - సంతాపించుచుండ వలసివచ్చెనుగద.

సీ ॥ తనయునిమెత్తని నునుమేనుహత్తంగ వలవదేదేహంబుగలఫ
లంబు । చిరునవ్వువెన్నెల జెలగుమోముగనంగ వలవదేగ

న్నులుగలఫలంబు । అలరారులేత చెక్కిలిగిల్లిముద్దిడ వలవదే పెద
వులు గలఫలంబు । అత్తత్తయనుమాట లాడనాకర్ణింప వలవదేకొ
ర్ణమ్ములఫలంబు ॥ తే ॥ గీ ॥ ఉల్లమలరించి మురిపించు నల్లరిపను ।
లెల్లపచరించు పిల్లల యింపుగాంచి । సుఖమనుభవింప వలవదా
సుగుణగణ్యా । కవితజనమాన్య నరజన్మ గలఫలంబు ॥

మ ॥ కొడుకుంబల్కులు ముద్దులొల్కుపసులన్ గూర్మిన్వినోదంబిం
చుపెం । పుడలిర్పశరీర మక్కునను సమ్మోదంబుసంధిల్లజే ।
న్చిదయాప్రేమలు సంఘటిల్లకుతుకశ్రీ నొందగారాలపం ।
తుదగన్జెన్నగుజన్మ జన్మనిదలంతుం దక్కుజన్మల్వృథా ॥వా॥వి

ఇవి యన్నియుగాక, ముఖ్యముగ గమనింపవలసిన విధాయకము
లగునవి - నాతదనంతరము ధరణీపాలనము సేయుట - నేను యమ
పురనివాసిని గాకయుండుట - యనునీరెంటిని బాగుగ - ఆగతానాగ
తము లెఱింగిన మీరుబాగుగ యోజింపవలయునుగద.

ఉ ॥ దేశములందుకోసలయు దేవతలందున దత్తమూర్తియున్ ।
శ్రీశునిభక్తిజ్ఞానమను చింతనలందున నంబరీషుడున్ । పాశము
లందునాగమును భామినులందనసూయసాధ్వియున్ । యా
శలుదీరసూనులున నంగనుమీరలె యుంగకుంటిరే ॥

క ॥ కులశీలమ్ములు నిలచెడి । దలపునుజనియింప నేను తనయులకొ
ఱకై । పలువిధ వెతలనుజెందిన చలనముబాఘంగదయ్య సం
యమివర్యా ॥

క ॥ పుడమీశుఁడు సత్యవ్రతు । (డిదెరాజ్యము పుత్రునకు సేనాధి
ధినే । కొడుకునకొసగగ వలయును । తడబాటునుబాయదె
లుపు తాపసవర్యా ॥

ఈ కారణము మీకుసమంజసమగునా కాదా?

భవదీయ కృపాకటాక్షమున ఇక్ష్వాకువంశీయులు పాలనసేయు రా
జ్యమునకు నెవని పట్టభద్రునిసేయ దలంపుగలదో నుడివిన - నగభా
గము దుఃఖోపశమనము కాగలదు.

త్తక్కిన సగభాగము " పుత్రేణలోకాన్ జయతి, అపుత్రస్య గతిర్నాస్తి॰ పున్నామ్నోనరకాత్త్రాయత ఇతిపుత్రః, పున్నామ్నోనరకాద్యస్మాత్పితరం త్రాయతేస్వయం- తస్మాత్పుత్రయితిప్రోక్తస్స్వయమేవ స్వయంభువః ॥ అను శ్రుతులను, స్మృతులను పాటింపవలదా.

మ ॥ విపరీతప్రతి భాషలేమిటికి నుర్వీనాథ యీపుత్రకా । త్రపరి
ష్వంగ సుఖంబుఁ జేకొనుము ముక్తాహారకర్పూరసాం । ద్రప
రాగప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయున్ బుత్రగా ।
త్రపరిష్వంగము సర్వజీవులకు హృద్యంబై కడుఁ శీతమే ॥ అని,

శ్లో ॥ కోటరాంతర్భవోవహ్ని స్తరుమేకందహిష్యతి । కుపుత్రస్తు
కులేజాతః స్వకులంనాశయేత్పరం ॥ అనునటుల పుట్టినపు

త్రులు తల్లిదండ్రులను దుఃఖబెట్టుట సత్యమేయైనను - నరకబాధను తొలఁగుటెటులనో దురూహంబు గానున్నది.

కావున వివేకశూన్యత, నరకము బాయు మార్గమూహించి చక్కఁగా వక్కాణింపుఁడు. అని ప్రార్థించెను.

—(వశిష్టబోధ.)—

నాయనా? త్రిశంకమహారాజా! నీవు చెప్పినటుల, ధన, రాజ్య భార్య పుత్రాదులెల్ల, అశాశ్వతములే - లోకములు, దేవతలు, నక్షత్రములు, మొదలగునవియును, చలనములగునవియే.

అచలమగునది బ్రహ్మమొక్కటియే? విక్షేపశక్తివలనఁబుట్టిన స్థూల సూక్ష్మ దేహములతోడను - అంతరింద్రియ - జ్ఞానేంద్రియ - కర్మేంద్రియముల తోడను కూడి - సకలపుణ్య కర్మములచేసి - చిత్తశుద్ధి గలిగి - సాధనచతుష్టయ సంపన్నుఁడై - వేదాంతశాస్త్ర శ్రవణ - మనననిధి ధ్యానములనుచేసి - బ్రహ్మజ్ఞానమును సంపాదించిన - బ్రహ్మజ్ఞానమును ప్రబలించి - విక్షేపశక్తి దొడ్డదై - ఆవరణశక్తిని నణచివైచును.

అట్టి నిర్గుణబ్రహ్మమే సత్యమై స్వయంప్రకాశమై గనుపట్టును.

సృష్టిప్రళయ - అవస్థాప్రళయ - దేహప్రళయ - మనుప్రళయ - బ్రహ్మప్రళయ - విష్ణుప్రళయ - రుద్రప్రళయ - మహేశ్వరప్రళయ - సదాశివప్రళయ - విరాట్పురుషాది ప్రళయములుగ ఆలోచి సర్వం ప్రతిష్ఠితం । మయిసర్వంలయంయాతి । తద్బ్రహ్మాస్మ్యహమద్వయం ॥ అను శ్రుత్యర్థమును గుర్తెఱింగి- నిరతిశయానందము చెందగలుగును.

శ్లో ॥ ఇదంసత్య మిదంసత్యం ఇదంసత్యం నసంశయః ॥ ఇదియు ముమ్మాటికి నిస్సందేహముగ సత్యము.

అవస్థలు యేడింటిలో ॥ అజ్ఞాన, ఆవరణ, విక్షేపములు - మూడును బంధహేతువులగును.

పరోక్షము - బంధప్రాప్తికిని - మోక్షప్రాప్తికిని కారణమగును.

అపరోక్షము - అనర్థనివృత్తియు - ఆనందావాప్తియు - అనెడు మూడవస్థలు - మోక్షప్రాప్తికే హేతువులగును.

ఈయేడవస్థలును - ఆరోపితమయిన - అహంకారమునకేకాని అహంకారసాక్షిని - నిర్వికారుడును - నగు పరబ్రహ్మకు లేవు.

ఈభావమే వేదాంతరహస్యమగు పూర్ణబోధ.

సుజ్ఞానబీజమునకు వృక్షమయి ఫలముగ్రోలందగు ఫలరసము. అని బాగుగా నెఱుంగవలయును. బ్రహ్మవేత్తలకు మయిత్రి - ముదిత కరుణ - ఉపేక్షయను నాలుగు సద్గుణములుండవలయును.

పెద్దలయందు విశ్వాసముగానడచుట, మైత్రి. సత్కర్మానుష్ఠానములు జేయువారియందు, బ్రహ్మజ్ఞానమునకు వచ్చెదరని సంతోషించుట, ముదిత. జ్ఞానములేక సత్కర్మానుష్ఠానమును జేయక, పాపకృత్యములనలుపక, యుండెడి పామరులనుజూచి చెడిపోవుచున్నారని వ్యాకులతజెందుట కరుణ. ఈముగ్గురియందును సమానదృష్టిని లేకయుండుట, ఉపేక్ష. అను సద్గుణములుగలిగి మాత్సర్యము స్పర్థ, అసూయ, నింద, యనునాలుగు దుష్టగుణములులేక యుండవలయును.

పరబ్రహ్మ యెట్టివాఁడనగా, భ్రూమధ్యము మొదలుకొని, పన్నెండంగుళములకు సహస్రారకమలము యెనిమిది భాగములై, ఒక్కొక్క భాగమునకు నూటయిరువదియైదు దళముల నొప్పుచు నుం డును. దానినడుమ హకారబిందు సకారములతోఁ గూడిన హంసమ ను పేరు గలిగియుండును. ఆబిందువే సంకల్పరూపమయిన అంతఃక రణము ॥ హంసోపనిషత్తునందు నిట్లు చెప్పెను.

" పూర్వదళే పుణ్యామతిః । ఆగ్నేయానిద్రాలస్యం । యామ్యేక్రౌర్యమనీషా నైఋత్యాంపాపేబుద్ధిః । వారుణ్యాం క్రీడా । వాయవ్యేగమనాదా కౌబేర్యాంరతిప్రీతిః । ఈశాన్యేద్రవ్యదానం మధ్యే వైరాగ్యం । కేసరేజాగ్రత । కర్ణికాయాం స్వప్నంలింగేసుషుప్తిః, పద్మత్యాగేతుర్యం,

ఈసంకల్పమాత్ర పురుషుఁడైన బ్రహ్మ - భూమి మొదలగు నా భూత ములలోఁ జేరక - ఆకాశస్వరూప మాత్రుఁడైయుండును - సంకల్పరూ పుఁడు బ్రహ్మయనునట్లుగా - మనస్సు చేతను దోఁచుచుండుగద.

అట్టి లోకమంతయు మనోవికారము.

రూపనామముల తోఁగూడిన పదార్థములయందుఁ దెలిసికొనుటకు మాత్రము అయిన దేహములు - యేమనస్సువలన గోచరించుచున్న వో అగోచరించెడి స్వరూపములను చిత్తమని దెలిసికొనుము. వెలు పలద్రవ్యముగాఁ దోఁచునది యేదియో నాద్రవ్యమే మానసమని- వే దాంతములయందు వచియింపబడుచున్నది. ఆలోచినదివినాగా మన స్సనేనామముకలది వేఱొండు లేదు. ఆలోచిన వృత్తినే మానసమని తె లిసికొనుము. యేస్థలమందు వృత్తి దోచుచున్నదో ఆప్రదేశమందే మ నస్సుండునని తెలిసికొనుము. ...

సీ॥ మనసయాసంసార మాయావికారము ల్మనసయాలౌకిక మహిమలన్ని । మనసయా పాపంబు మనసయాపుణ్యంబు మనస యాలోకాదిమత్సరములు । మనసయా జీవులు మనసయా జనములు

మనసయాసుఖదుఃఖమలినములును । మనసయాస్త్రీలును మనసయా పురుషులు మనసయాయఖిలాశ్రమంబులెల్ల ॥ గీ ॥ మనసుగాకున్నదొకటైన మాయలేదు । మాయగాకున్నదొకటైనమనసులేదు । యఖిల జగముమనోమాయలగుటదెలిసి । బ్రదుకనేర్చినవారలుబ్రహ్మవిదులు ॥

అఖండమయి, ఆద్యంతరహితమై, అపరిమేయమయి, అవాఙ్మానసగోచరమై, సచ్చిదానందమయి, స్వయంప్రకాశమయి, అపరిచ్ఛిన్నమయి, అనావృతమయి, అనేకరూపమయి, నిత్యమై, నిర్మలమయి, నామరూపక్రియాతీతమయి, నానారూపమయి, సర్వవ్యాపకమయి, సర్వాంతర్యామియయి, వెలుగునదియే, పరబ్రహ్మము.

ఆపరబ్రహ్మము, మూలప్రకృతియని, అవ్యక్తమని. వ్యవహరింపఁబడు మాయాశక్తియొకటితోఁ జేరును. ప్రళయకాలమున సూర్యచంద్రులు సృజింపఁబడుటకుముందు దట్టముగా నెల్లెడల నావరించుకొనిన గాఢాంధకారమునే మాయయనఁబడును. అట్టి, ప్రధానపురుషునియందు కాలవృత్తి సమసినవేళయందు, నొకశబ్దముపుట్టెను. అందున నాకాశతత్వము శబ్దానికివాయువు, శబ్దానికిరూపము, తన్మాత్రగుణంబయ్యె. ఆరూపమున వహ్నితత్వము, దానికి, రసంబు తన్మాత్రగుణంబయ్యె. ఆరసగుణంబు వలన, నుదకతత్వంబుబుట్టె. ఆయుదకంబున, గంధంబు తన్మాత్రగుణంబయ్యె. ఆగంధంబువలన, భూమితత్వంబు బుట్టెను. ఆభూమికి శబ్దాదులేనును తన్మాత్రగుణంబులయ్యె. అట్టి పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులను భూతపంచకంబును, శబ్దస్పర్శరూపరసగంధంబులను, గుణపంచకంబును, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను, బుద్ధీంద్రియపంచకంబును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకంబును, మనోబుద్ధ్యహంకారంబులతోడ, రాజసతామససాత్వికగుణోద్రిక్తంబుగా ప్రజాసృష్టినివిస్తరిల్లె.

మ ॥ పరమాత్ముండును పంచభూతమయుఁడుబ్రహ్మాణ్యుఁడుం దానయై । హరినారాయణమూర్తితాననుపమంబై యొప్పియం

క్షోణిపై ! సురగాక్షీర్వరతల్పాంత్రై మెఱసి తానున్న పద్మాక్షియ
ముగా ! త్రిరజోవృత్తి వహించు మాయనమునన్ దీపించె సృష్టిక్రి
యల్ ॥ మఱియు,

మ॥ అహంకారంబై జలబుద్బుదప్రతిమమై యంభోధిలో నొక్కయం !
డమును జన్మించి క్రమక్రమంబున నిరూఢబ్రహ్మాండత్వంబునన్ !
సుమహాత్వంబుననుండె దానివలనస్తోకంబులై వారివ ! ద్విమ
మసుద్వీప్తుకదంబులావృతములై పేపారెగాథంబుగన్ ॥

అట్టియండంబులోవల సాత్త్విక, రాజస, తామసములనెడిమూ
డుగుణంబులు బుట్టెను. సాత్త్విక మాయననుసరించి విష్ణుమూర్తియు
రాజసమాయననుసరించి చతుర్ముఖుఁడును, తామసమాయననుసరిం
చి రుద్రమూర్తియు, ప్రపంచమును గలుగఁజేసి, యోగిశ్రేష్ఠుల
నారయుచు సాక్షిభూతులై సృష్టిస్థితిలయములను మూడుకార్యముల
ను మగ్గునువహించి చేయుచుందురు.

సూర్యచంద్రులు గాలివలన, నీటికదలికవలన, నొకచోటినుండి
మరియొకచోటికిపోయినట్లు, జీవుఁడును తనత్రికరణముల చేత, చేయ
బడిన పుణ్యకర్మ, పాపకర్మ మిశ్రకర్మములవలనఁ గలిగిన మనుష్యా
ది శరీరములనుండి యితర శరీరములయందు అనేకములఁ బ్రవేశించు
చుందురు.

శ్లో॥ కర్మణాంపరిణామత్వా దావిరించ్యాదమంగళమ్ ! అవశ్యమ
నుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్॥ " అనుప్రమాణముచేత సృ
ష్టికర్తయైన, బ్రహ్మ సహితము. కర్మఫలము ననుభవించెను.

శ్లో॥ సూర్యాగ్ని ర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖమ్ మరుజ్జ
లమ్ ! భూరాత్మా సర్వభూతాని భద్రపూజా పదాని మే॥ " అనియు
న్నది. గావున, సర్వభూతాంత రాత్మయగు, భగవంతునిగా భావించి,
ధర్మము గో బ్రాహ్మణ సంరక్షణ యజ్ఞములు వ్రతములు దీక్షలు వే
దములు భూతములు సత్యము తపస్సు గురువు గురువుచేనుపదేశింపం

బడిన, మంత్రాదులు జైనభక్తియనువానిచక్కఁగా శ్రద్ధాభక్తులతోఁ గాంచుచు సుఖదుఃఖ మానావమానాదులను లెక్కింపక రాజ్యపాలనము సేయుచుండుము. ఇట్టుల నర్తించు చుంటివేని, స్థావర జంగమములను రెండు విధములైన జీవులతోఁ గూడిన, బ్రహ్మ విష్ణు రుద్రమహేశ్వర సదాశివ మహాండములుగల లోకమే రూపముగాగలదైన, సత్తు చిత్తు ఆనందము నిత్యము నిర్మలత్వముగల పరమాత్మయొక్క తేజస్సును గాంచగలుగుదువు. ఈషణ త్రయములగు పుత్రేషణ ధనేషణ దారేషణ యనుమూడును రాజకు సాక్ష్యముగ నుండవలసినదే. కం॥ విను గార్హపత్యమనున । య్యనలము విహరింపఁబడిత దాహవనీయం । బన వెలుగు నట్లు వెలుగును। జనకుఁడు దాపుత్రుఁడైని జద్యుతితోఁడన్॥ ” అనెడిలోక వాడుక సుప్రసిద్ధముగనున్నది.
“ పుత్ః త్రాయ ఇతి పుత్రః । పున్నామ్నో నరకాద్యస్మాత్ త్రాయతే స పుత్రః॥ ” అని వ్యుత్పత్తి పుత్ అనగా, పాతయుతెలి పుత్ క్రిందికి త్రోయుదానికి పుత్రనిపేరు.

శ్లో॥ బహువిధ పాపవశాదిహ నానాయోనిషు జన్మమృతీయా
తో దేహ । దైవాదుత్తమమానుషపౌరుషవిప్రదేహ । విద్యా
సంపన్నోపి బ్రహ్మణేతరమే విముఖోసుఖి దుఃఖ్యవమైషినశ్య
తి నశ్యతి నశ్యత్యేవ॥ అనుశాస్త్ర ప్రమాణమున. అనేక కోట్లజన్మలెత్తి యీ పరిపుణ్యభూమియందు సర్వోత్తమమైన మనుష్యజన్మమెత్తి, అందుపురుషుఁడును, విప్రుఁడును, విద్యాసంపన్నుఁడునైన మీవంటివారిజన్మములకును, యజ్ఞానమునకును, సుజ్ఞానమునకును, పేరగును. ప్రపంచము బ్రహ్మతత్త్వము తెలుసుకొను తెలివికే పుత్రుఁడని పేరు, తెలివిలేనివాఁడె అపుత్రుఁడు. అట్టివానికి సద్గతి లేదని “అపుత్రస్యగతిర్నాస్తి” యనుశ్రుతికర్మమే శ్రు. “నమాగంసవేశలగపుత్రఃనా విద్వాన్ నవికర్మకృత్ । స్వయంనయత స్వర్గంకింపునఃపితరం తరేత్తను” శ్రుతివలన స్త్రీపురుషసంసర్గసంజనిత పుత్రుడని, వానివలన

పున్నామనరకనివృత్తిననిచెప్పుట యజ్ఞానము, యసత్యము, యని న మ్మము. పూర్వజన్మములయందు చేసిన, పుణ్యపాపమిశ్రకర్మలవల్లనై న ఫలమునకు అనుకూలముగానే మనస్సు వినుట, స్పృశించుట, చూచుట, చవిచూచుట, ఆఘ్రాణించుట మొదలయిన చాంచల్యములుగ లిగియుండును. పూర్వజన్మార్జితసుకృతవిశేషమువలన, గలుగు ప్రారబ్ధ కర్మఫలానుభవమెటువంటివారినిగాని విడువదు. ఈశ్వరకటాక్షమును పెద్దల యాశీర్వాదమును సుజ్ఞానమును సంపాదించుకొన్న సజ్జనులవిషయమున మాత్రమంతగా కర్మమునకధికారము చెల్లదు.

కాబట్టి, దానికార్యమగుదుఃఖమొక పర్వతము మాదిరిగవచ్చినను, తుదకు పరమాణువుగాఁ బరిణమించితనంతటనే విరిగిపోవును. ఏయేకాలముల నేయేసుఖదుఃఖముల ననుభవింప వలసియుండునో ఆయాసుఖదుఃఖములననుభవించినఁగానితీఱదు.

దుర్విలంఘ్యమగు విధిప్రతికూలమైనసమయమందు సులభముగా దుఃఖనివృత్తియగుటకు, సాధుసేవయొక్కటియే ప్రధానసాధనమని, త్రిమూర్తులచే బోధింపఁబడెను. ఇంతకు పూర్వము మావంశీయులలోఁ మాంధాతమహారాజు చిరకాలము నీవలెనే తనకుఁదనయులు లేనందు నఁజింతించుచుండి తపము చేయుచుండెను.

అనమయమున నారద మహర్షి మాగృహమునకువిచ్చేసి, రాజుభార్యచే మాఁనుభక్ష్యములు గ్రహించి ముగ్గురుపుత్రులుగలుగుదురని యాశీర్వదించి పోయెను. ఆకర్వచనమువలన ముగ్గురుకొడుకులు పుట్టిజగత్ప్రసిద్ధులైరి నీవును సాధు సత్తముల నిత్యమును పూజింపుచున్నపక్షమున సర్వార్థములు నీకు సులభముగా సిద్ధించుననుటకు సందేహము లేదు. నీవు న్యాయమార్గమున రాజ్యపాలనము జేసి ధనము నార్జించుచు, ఆర్జించిన ధనము సత్పాత్రముల యందు వినియోగపఱచుచు నీవనుభవించుచు సత్పురుషులతో సహవాసము జేయుచు శాస్త్రోక్తశ్రమగల సత్ప్రవర్తకుడవై యుంటివి. నీపరిపాలన

వలన నేఁడీనాఁడు రాజ్యములయందును విశ్వాసహీనులు లోభగుణ విశిష్టులు ద్రోహాన్వేషణపరులు పరద్రవ్యముల నపహరించువారు పరులను మోసపుచ్చువారు పితృగురు జనములకు ద్రోహ మొనర్చువారు పరదారల నభిలషించువారు పాప కర్మాచరణమునకు ప్రముఖులై కల్లలాడువారు అధిక ప్రసంగములు చేయుచు హరి భక్తులయందు ద్వేషముగలవారు శుష్కవేదాంతము లుపన్యసించు వారు వేదశాస్త్రముల నిందించువారు సాధువాక్యముల నుపేక్షించు వారు భూతదయా దాక్షిణ్యములు లేనివారు దురహంకారము గలవారు మొదలగు ప్రవర్తకులు లేరు.

యోగులకు బలముపవాసము. మహాత్ములకు బలము జ్ఞానము బ్రాహ్మణులకు బలము వేదము. పక్షులకు బలము రెక్కలు. మానవులకు బలమన్నము. పురుషులకు బలము ధనము. సర్వులకు బలము రాజు. యోధులకు బలము ధైర్యము. స్త్రీలకు బలము సుశీలత. గృహస్థులకు బలము గృహిణి. అని చెప్పినటుల నీయేలుబడిలోనివియెల్లను సమృద్ధిగా వృద్ధిఁబొందుచున్నవి. గానిలోపములు లేకపోవుటయే గాక.— సీ॥ బ్రహ్మంబు నేనని పలుమారు ననవచ్చు బ్రహ్మబోధమెయుంగుభావమరుదు। వేదాంతశాస్త్రముల్విభజింపగావచ్చు నాత్మార్థముఁదెల్పుటదియునరుదు। సర్వంబులునురోసి సన్యాసిననవచ్చు శూన్యమార్గంబులోఁ జూచుటరుదు। అదిబంధమోక్షంబులని జెప్పగావచ్చు దానుగానిలక్షదనరుటరుదు। తనువుఁనర్థంబు గురునివి యనగవచ్చు। దానికొనసిన లోభంబుడించుటరుదు। మనసుసామర్థ్యమెంతిగెడి మర్మమెరుఁగుటరుదు। అంతతానయ్యుగాకుండుటదియునరుదు॥ ...

గీ॥ శుష్కవేదాంతసిద్ధాంతసూటిపరులు ఆత్మనెఱుంగక యర్థములువ్యర్థముగను। జెప్పుచుందురు లోకులజెఱచుకొఱకు। నిజము నిష్ఠూరమైకల్లనిజములాయె॥ ...

గీ॥ సాంఖ్యతారక యోగసంజ్ఞల నెఱింగి। రాజశివయోగసం

యోగరామరాజ । ఖేచరీయుక్తసౌఖ్యలక్ష్మీరతుండు । నాదవేదాంత వేద విద్యావిహారుండు ॥

సీ ॥ ఉత్తర శాంభవీ యుక్తుండు ముక్తుండు పరమ విద్యాధురంధరుండు గురుడు । తుర్యసుఖాస్వాద ధుర్యుండు నార్యుండు బహిర్మనుకూల సంభ్రముడు సముడు । నాదాంత విద్యావినోదుండు మోదుండు పురుషార్థ నటన సంభోగి యోగి । కూలంకషజ్ఞాన గూఢు డారూఢుండు దృగ్దృశ్యరాగ వర్జితుడు మితుడు । వేద వేదాంత సిద్ధాంత వేద్యుడాద్యు । డాత్మసుస్థిర చిత్సుఖా త్మసహదేహి । నిర్వికల్ప సమాధి నిర్ణేతదాత । కారణాచార్య సేవాధికారి సూరి ॥

వ ॥ ఇట్టి వారలు నీచె పోషింప బడుచుండిరి. ఐహికాముష్మికములు సమభావము జేసి వర్తించుటయే సంసార మనబడును. అట్టిదానికి ధనము, సంతానము, సుగుణవతి, అనుకూలవతియగు భార్య సకల విద్యాపారంగత్వము, గల్గి యుండవలయును. నీకు సర్వసౌఖ్యములు మితిగల జ్ఞానము నొప్పియున్నది. మీపూర్వుల ధర్మకీర్తులు నిలుచు నటుల రాజ్యపాలనము సేయుచుంటివి. నీవు మూడుశంకలుగల్గి జన్మించుటచే సార్థక నామము వ్రాయ బడెను. ఇంక ముందట్టి శంకలు నివర్తి కాగలవు. ప్రకృతము నింతకన్న నధికముగ దెలుపుట కెద్దియును లేదు. సంశయముల మది నుంపకుము. నక్షత్రములలో చంద్రుడును, దేవతలలో నింద్రుడును, పక్షులలో గరుత్మంతుడును, తపస్సులలో విశ్వామిత్రుడును, మణులలో చింతామణియును, గజములలో నైరావతము, అశ్వములలో నుచ్చైశ్రవమును, మృగములలో కేసరియును, రాజులలో ఇక్ష్వాకును గౌరవింప బడుచుండిరి. అట్టి సూర్యవంశమందు జనించిన నీకు శాశ్వత గౌరవము లభింప గలదు. నీకు బ్రహ్మవిద్యా నిధానుడును, సత్య నిష్ఠాగరిష్ఠుడునగు, కొమారుడుదయించును. నీవు శాశ్వతానంద మనుభవింపగలవు. గావున చింతవీడుము. అట్టి సుపుత్రుడు గలుగుట కొకవ్రతము గలదు.

దానికధిపతి మూడుశిరములు ఆఱు బాహువులు శంఖు చక్రము గద త్రిశూలము ఖడ్గము కమండములధరించి సిద్ధ చారణ కిన్నరాదుల చే పూజింపబడుచు త్రిగుణాత్మకుండై అనసూయాత్రి కుమారుడనం బరగు శ్రీదత్తాత్రేయమూర్తి యొప్పియున్నవాడు. అట్టిసచ్చరిత్ర ను విధ్యుక్తముగా పూజించి ఆజ్యాహుతులచే తృప్తిని జేయ నీవాంఛితము నెరవేర గలదు. ఆమహనీయుని జనన కారణము వినుము.

సీ॥ వరవజ్రగర్భితవాసవమణిమయచారుకోటిస్తంభసంభృతంబు। మహనీయతరరత్న మణిసాగరచితంబు బహురత్నకలశ విభ్రాజితంబు। లలితమందారమాలాజాలయుక్తంబు పృథుచతుశ్శాలాభివేష్టితంబు। మౌక్తికమాణిక్యమణిరాశిసహితంబు। హరిణ చామర దర్పణాన్వితంబు॥ తే॥ గీ॥ రత్నసూత్రగ్రథితహారిద్రత్నముకుర। సాలపల్లవతోరణజాలయుతము। రత్నసుస్తంభశోభితప్రాంగణంబు। ననుచువిలసిల్లునొక్కగృహంబునందు॥

సీ॥ ఒకవంకమణివికారోరుకుంభసహస్ర మొకచెసరత్నపాత్రికలుకోటి। యొకయోరనభినవ వికసితసుమజాల మొకచాయభోగవస్తూత్కరంబు। నొక కేవగాంచనాంశుకసహస్రాయుత మొకమూలశ్రీగంధ యుక్తపాత్ర। లొకచోట మణిదండ వికచ చామరశతంబొక మొదమృదులతల్పకసహస్ర॥

తే॥ గీ॥ మొకటమణిమయపీఠికాయుతశతంబు। లొకటరత్ననిర్మితవేదికోత్కరంబు। గలిగి యతిరమ్యమై మహాజ్వాలనితాంత। మణిరుచులచేత నొప్పునమ్మందిరంబు॥

తే॥ గీ॥ ఎద్దిబ్రహ్మాండదుర్లభ మెద్దిరమ్య। మెద్దివాఙ్మనోగోచర మెద్దిసర్వ। కవులకనిరూపితం బెద్ది కనియువినియు నెఱుఁగరట్టి వస్తువులచె వఱలుచుండు॥

అట్టి పరమాద్భుతంబైన యద్దివ్యసదసంబున, ధనుశ్శతపరిణామంబును వర్తులాకారంబును రత్నకింకిణీ పరివేష్టితంబును, విచిత్ర

రత్నపాంచాలికా సమూహ సహ్యమానంబును బుష్పితచిత్రకానన భూషితంబునైయొప్పు నొక్కరత్న దివ్యసింహాసనంబు తదుపరిభాగంబున సప్తతాళప్రమాణోత్సేధంబై సమంతతోవ్యాప్తంబై కోటిసూర్యసమప్రభంబై పరమాద్భుతంబై యతిదుర్నిరీక్ష్యంబై సర్వవ్యాపకంబై సర్వకారణంబై చక్షుర్బోధకరంబై యొప్పు, పరమపదమునందు,

శ్రీ, భూ, నీళా, సమన్వితుండై అనంత, గరుడ, విష్వక్సేనాది నిత్యసూరులును బ్రహ్మరుద్రేంద్రాదులును పరివేష్టించియుండుతరి కలహాశనుండును పరమ భాగవతశిఖామణియునగు నారదమహర్షి.

సీ॥ తులసిరుద్రాక్షల మాలలుధరియించి యూర్ధ్వపుండ్రం
బులునొప్పియుండ। భుజముపై తాంబురపొలుపొందు తాళముల్। శి
రముపైజడయును మెఱయుచుండ। కాషాయవస్త్రంబు కాచబిగింపు
ను గడ్డంబుమీసంబు గదలియాడ। నిర్గుణపరమాత్మనిఖిలేశ కేశ
వా। నారాయణాచ్యుతసారసాక్ష॥

గీ॥ యజ్ఞరక్షకయజ్ఞేశయజ్ఞరూప। లోకనాయక మాధవా
లోకవంద్య। శ్రీరమానాధ పరమాత్మ శేషశయన। పరమపదవాస
మాం పాహిపాహిపాహి॥

అనుచువచ్చిశ్రీమన్నారాయణా! శంకరా! చతురాననా! మీ పాదపద్మములకు వందనములాచరించుచున్నాడనని వారలచేసన్న నెఱింగి యాసనముపై గూర్చుండెను. అంతనారాయణుండు నారదా! త్రిలోకసంచారివికావున, విశేషములేమైన గలవేనివక్కాణింపుమనెను.

నారదుండు ముకుళితహస్తుండై సృష్టిస్థితిలయాధికారులగు తమకుదెలియని విషయములుగలవే? ఐనను నేగనివిన్నది విశదీకరించెదను. సంపూర్ణదయతో సాకల్యముగ సావధానముగ నాకర్ణింపుడు. విశ్వకర్మచే నాకు కానుకగనొసంగబడియుండు, ఉక్కుశనగలు పచనము చేసిపెట్టుటకు, లక్ష్మి, సరస్వతి, పార్వతి శచి, లోపాముద్ర, అరుంధతీ మొదలగు పతివ్రతలను గోరితిని. వారివలన పచన

ము శాంతమునని రాశజెందక అత్రిమహామునిపత్నియగు యనసూయ కడకేగి యామెకు దెలిపితిని. ఆకసనగుబ గొని త్వరితిలో పక్వము జేసి భుజించుట కనువుగ నిచ్చెను. అపరమపతివ్రతామణీ కృపచే క్షుధ తీర్చుకొంటిని. ఆమెపాతివ్రత్య మహిమ కొనియాడ శేషునకైన నలవి కాదు. తక్కుంగల పతివ్రతల మనువారు నామమాత్రావశిష్టులేకాని, యీయనసూయకు సరిరారు. ఇంతకన్న విశేషమెద్దియు గనరాదు. అనివిస్మయించి త్రిమూర్తుల సెలవంది వెడలి పోయెను. అనంతరము సర్వజ్ఞుండగు నారాయణుండు యత్రియనసూయుల వాంఛిత మీడేర్చుటకు సమయము సమీపించినదని హృదయమున దలంచి బ్రహ్మ సదాశివులార? నారదుని వాక్యముల వినియుంటిరిగదా శీఘ్రమున మాయుమ్మువ్వరము యనసూయ పతివ్రతా ప్రభావము పరిశీలించి రావలయునని తలంపుజనించినది కాపున బోజము రెండు జాని త్రయోన్నోన్యమ్మభుండయ్యెను. వారిఋపురును సమ్మతించిరి. తపస్వులు త్రిలోకములకు ఈప్రకారముగా నుపదేశించెననిసూతుండు శౌనకాది మహాత్ములకు నుడివిన సంతోషభరితాంతరంగులైతమ హరి వృత్తాంతంబును దెలుపుచుటయును. ...

కం॥ వేదాంతతత్త్వనిశ్చయ। వాదాస్పద దేవదేవ వసుదేవసుతా
వైదర్భవినుతగాత్ర। మోదక్రీడావినోదమురళీగానా॥ ...

కం॥ గోపాలవేషధారికి। గోపీజన పూర్వభాగ్యఘోషాశ్రయకున్
గోపక్రీ[illegible]। గోపక్రీడావినోదగోపాలునకున్॥ ...

గద్యము. [illegible] హారితసగోత్ర వార
ణాసి వంశపవిత్ర కోటమార్యపుత్ర పుల్లమాంబాగ
ర్భశుక్తిముక్తాఫల రామయాఖ్యహరిదాస ప్ర
ణీతంబగు శ్రీరామాచల పూర్ణబోధిని
యను గ్రంథమునందు ద్వితీయ
ప్రకరణము దత్తాత్రే
యార్పణమస్తు.






# శ్రీరామాచలపూర్ణబోధిని.

## తృతీయప్రకరణము.

వశిష్ఠమహర్షి త్రిశంకునకు ఇట్లు జెప్పెనని శౌనకాదులకు సూతుండు జెప్పుచున్నాడు.

సీ॥ మాలతీమందార మాలూరజంబీర మాతులుంగ కపిత్థమరు
వసరళ। సాలరసాల తమాలచందన బిల్వపున్నాగ పనస
జంబూలవంగ। ఖర్జూర - నారంగ. కట్ఫలా క్రముకాది -
తరులతా, బృందంబు, దగినరీతి, ఫలపుష్ప భరితమై -
ప్రభగల శారికా - చక్రవాక మరాళ శరభ సింహ॥

గీ॥ గవయ వంచక శార్దూల ఖడ్గ ఝిల్లి। కేకిబకబలాహాక శు
క కిటియు నాది॥ విహగ మృగమత్త మధుకర వితతి కనువు
నైన కాసార గిరులొప్పు యాశ్రమంబు॥

వ॥ సాలరసాల బిల్వకదళీఖర్జూర జంబూజంబీరచందన పు
న్నాగమందారాది వివిధవృక్షనిబిడంబును, పుష్పఫలభరిత శాఖావ
నమ్ర తరులతాబృందంబును, మాధవీకుంజ మంజరీపుంజ మకరంద
పానమత్త మధుకరనికరఝుంకారారవము భరితహరిదంతరంబును, క

నక కమలకల్హారవిలసత్సరోవిహారణమీన చక్రవాక బక, క్రౌంచమ రాళ దంపతీమండల మండితంబును, మృణాళభోజనాసక్త సారసచ యచంచూపుటవిపాటిత కమలముకుళ కేసరవిసరవితత ప్రశస్తస రోవరంబునునై వెలుఁగునవ్వనంబున. జటావల్కల కృష్ణాజినోత్తరీయ, జపమాలికాదండకమండలధరుండై, నిర్మలతపోధ్యానానుష్ఠానగరిష్ఠుఁ డగు అత్రిమహాముని, సుఖాసనమున సమాధినిష్ఠయందధిష్ఠించియుం డుయవసరంబున, సురాసుర జేగీయమానుండగు, శ్రీమహావిష్ణువును, త్రిలోకేశుండునగు, శంకరుండును, సృష్టికర్తయగు, బ్రహ్మదేవుండు ను, నారదునిచేనాకర్ణించిన యనసూయా పాతివ్రత్యము పరిశీలన మే పనిగాఁగొని బ్రాహ్మణవేషములు, భస్మరుద్రాక్ష త్రిపుండ్ర మా లికాధారులై కరముల గఱ్ఱలనూఁతఁగొని వడవడవడంకెడి, చమ్మగిలి న చమటగల మేనుల, క్షుధాతురులై, మిక్కిలిదురవస్థ, ననుభవించు చువారలు జరాభారాధికమున దేహమునందలి రక్తమాంసములుబొ త్తుగాక్షీణించినవారలును, సైగనుపట్టుచు మెల్లమెల్లన అత్రిమహాము ని యాశ్రమమును బ్రవేశించిరి.

పరమ పతివ్రతాశిరోమణి, సుగుణఘనియగు, అనసూయా దేవిని బొడగనిరి. సంతసించిరి. ఆమెతో సంభాషించు దలంపుగొనిరి.

విష్ణుఁడు. = ఓయమ్మా! మాగాఢయానమున కడుడస్సితిమి. "గోరుచుట్టుపైరోకలిపాటు" యనునటుల క్షుద్బాధాపీడకులోనైతి మి. మా సంక్షోభమును శీఘ్రమున బాపఁగల ఋషిపత్నివనినెంచితి మి. నినుగాంచితిమి. నీపుణ్యముపారమని వినియుంటిమి. క్షుద్బాధ ని వారణమునకు వెనుదీయకుము. సమాధినిష్ఠనుండినీపతియరుదెంచువర కు నిరీక్షింపకుము. మేము సంతసిలునటుల జేయుము. సకల దానము లలోనన్నదానము. దానికన్నమెండగునదినిధానము. అనువాక్యమిప్ప ట్టున నెంచకుము. "అభ్యాగతఃస్వయంవిష్ణుః" అనునార్యోక్తినెఱుం గుము. కరుణార్ద్రహృదయవగుము. అనిబలికిరి. ఆవాక్యములవిని, వా

కోటిబ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అవాఙ్మానసగోచరా! బహుకాలమునుండి, పుత్ర వ్యామోహముననుండు మమ్ముసఫలీకృతమనోరథులగ గావించితిరే? అనవిని, మందస్మిత వదనారవిందులైరి. కొంతసేపటికి నారాయణుండు, ఋషిపత్నీ! నీపతిచిరకాలము నుండి సంతానమునకై తపమాచరించుచుండుటచే విశ్వసించినారము. బాలక్రీడలజూపెదము. నీమనోవాంఛను దీర్చుకొనుము. అనికనుమఱగైరి. ఆమె చిఱుతబాలురగాంచి, వాంఛితమీడేరెనని, సంతసించి, గోక్షీరముల, నాముగ్గురుబాలురకు ద్రావించెను. ఇంతలో అత్రిమహాముని యేతెంచెను. కందువ్రులకాంచెను. త నదివ్యదృష్టిని యుదంతంబంతయు నెఱింగెను. నివ్వెఱపాటొందెను. అత్రి ఋషిపత్ని ముఖమువీక్షించెను. భయాతురతజెందినదై పతిపాదములకొఱఁగివేచి ముకుళితహస్తయై నాథా మనోచాపల్యమున నిటుగావించినందులకు పుత్రవ్యామోహమునకును క్షమింపవలయునని దీనవదనయై గద్గదస్వరమునబలికెను. అప్పలుకులాలకించి ఋషిపుంగవుడు ప్రేయసీ నాతపస్సుఫలించెను. నీవివేకమునకు నాజన్మ సాఫల్యమయ్యెను. ధన్యతజెందితిమి. ఇంతకన్నవలయు కార్యమేమిగలదే వినుము. (సదేవ సౌమ్యేదమగ్రఆసీత్) అనుశ్రుతిప్రమాణములం తత్వమెతనకుదానై వెలుంగునదియై (దీవ్యతేత్యయమేవతత్) అనుప్రమాణరీత్యా స్వయంప్రభమై ప్రకాశింపుచుండును. అట్టిపరబ్రహ్మమే జగదుత్పత్తికి కారణభూతుడును త్రికాలవర్తిత్వ జ్ఞానస్వరూపత్వ ఆనందమయత్వాదులను ధర్మములతో నొప్పుచుండు సాత్విక రాజస తామసములనెడి మూడుగుణములు గలిగిన తనమాయను ప్రవేశించి సాత్వికమున విష్ణుమూర్తిగను రాజసమున చతుర్ముఖుండుగను తామసమున రుద్రమూర్తిగను ఈయాశ్చర్యకరమగు ప్రపంచమున అణోరణీయాన్మహతో మహీయాన్ అనుశ్రుతిచేత అణువుకంటె అణువుగాను మహత్తునకంటె మహత్తుగాను నుండుబ్రహ్మలను

నీవు బాలరూపులుగ జేసితివనిమురియకుము. ఆమహామహుఁడు పరా పశ్యంతి మధ్యమా వైఖరీ అను వాక్కునకందనివాఁడు సర్వాధారో నిరాధారః అనునటుల సర్వమునకు పట్టుగొమ్మయగువాఁడు అశేష సంకల్పుఁడు శ్రేష్ఠమైన జీవపరత్వయోగముగలవాఁడు జ్ఞానాధిక్యముచేత సమర్థుండగువాఁడు తనుస్థూలాకృతియగు విశ్వాకృతిగలవాఁడు విశ్వమేవేదంపురుషః వేదమయుండు స్థూలమున సూక్ష్మములయిన ప్రపంచలీలారూపములు గలవాఁడు. స్థావరజంగమ రూపములైన సకలప్రాణులకును శ్రోత్రము, త్వక్కు. చక్షువు, జిహ్వా ఘ్రాణము, అనెడు, జ్ఞానేంద్రియములకును, వాక్కు పాణి, పాదము, గుదము, గుహ్యము, లనెడుకర్మేంద్రియములకును మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, లనెడి యంతరేంద్రియములకును, ప్రాణాపాన వ్యానోదాన సమానములనెడు, పంచప్రాణులకును, వానియధిదేవలకును విషయములకును, మూలప్రకృతికిని, ఆప్రకృతివలనఁబుట్టినమహత్తత్వమునకును ఆమహాతత్వమువలనఁ గలిగిన యహంకారమునకును, దానివలనఁబుట్టిన, శబ్దస్పర్శ, రూపరస, గంధములనెడు, పంచతన్మాత్రలకును, దానివలనఁబుట్టిన, యాకాశవాయురగ్ని. జలభూములనెడు పంచమహాభూతములకును, ఆపంచమహాభూతమయమైన ప్రపంచమునకును, ప్రభువగువాఁడునై యొప్పుచు ప్రకృతిసంబంధములైన, శాంత, ఘోర, మూఢవృత్తులుగల, సత్వ రజో, తమోగుణములును, పుట్టుట, పెరుగుట, ముదియుట, చిక్కుటఁ చచ్చుట, మొదలగు వికారములులేక, నిర్గుణ, నిర్వికారతచే, వెలుగుచు, సృష్టిస్థితిలయతిరోధానానుగ్రహములనెడు పంచకృత్యములు చేయుటకు కర్తయై, బ్రహ్మవిద్వరిష్ఠుండై, బ్రహ్మాండము మొదలు, మాయాండపర్యంతమైన, మేలుగలుగఁజేయువాఁడై, పదునాలుగులోకములు తనయందును, తానాయాలోకములయందును గలవాఁడై. చతుర్ముఖ బ్రహ్మరూపముజేత సృష్టియు, విష్ణురూపమునరక్షించుటయు, మహేశ్వరరూప

మున, లయమొందచేయుటయు, గలవారయి యుందురు.

బ్రహ్మమానసపుత్త్రుండును, తాపసవర్యుండును, త్రిలోకసంచారియునగు, నారదమహర్షియొక్క కరుణవలన, నిన్ను బవిత్రతజేయ నిజరూపముల జూపక, బ్రాహ్మణ వేషధారులై విచ్చేసిరి. ఇంతవరకు "అహంబ్రహ్మాస్మి" యని, "మృత్యోస్సమృత్యుమాప్నోతి । యఇహనానేవపశ్యతి భయంద్వితీయాద్వి నివేశతస్యాత్ ॥

అనుశ్రుతివలన, బ్రహ్మము వేరు, తాను వేఱనెడు భేదబుద్ధియే, మృత్యువుగాన నద్దానిని నశింపజేసితివి, జ్ఞాననేత్రముచేత చూడందగినవస్తువను చర్మచక్షువులచేజూచి కృతార్థురాలవైతివి. ఇపుడుసర్వోపనిషన్మయమైన. దివ్యమంగళవిగ్రహముల నిర్వికల్పసమాధిచేత,

"సర్వంఖల్విదం బ్రహ్మబ్రహ్మైవాహమిదం । జగత్సకలం బ్రహ్మణోన్యం నకించన" అనునటుల స్వాభిన్నపరబ్రహ్మను గాంచెడి ఫలంబుసమకూర్చితివి. భక్తవత్సలురు, పురాణపురుషులు, పరంధాములగువారల ననాయాసముగాదరిశించితివి. అనిబలికి భక్తివినమ్రుండై,

కం॥ ఏమోభక్తుల కనిశం । బేమో రూపముల యందు నిచ్ఛ నిజంచు । న్యాయక భక్తులకోఱకై । యామాహూపముల దాల్తువ గుణుండ వయ్యున్ ॥

వ॥ అని ధ్యానింపుచు తన్మయుడయ్యెను.

"మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకుం దానొక్కొక్కడై తోచుపో । లిక నేదేవుండు సర్వకాలము మహాలీలన్నిజోత్పన్నజ । న్యక దంబంబులహృత్సరోరుహముల న్నానా విధానూనరూప కుండైయొప్పుచునుండు నట్టిహరి నేబ్రార్థింతు శుద్ధాత్మనై

వ॥ అని ధ్యానింపుచు, అనసూయయు నై మరచెను. అంత విరించి విష్ణువులో మనము పరిశీలనార్థము వచ్చి బాలురమై యుండుటకు గతంబెయ్యది. యన నారాయణుండు అనసూయ పతివ్రతలలో మిన్నయగుటచే మనలను గుర్తెరుంగుట ప్రథమ సంభాషణమున నేతే

ట పడెను. భక్తిసంభ్రమముప్పతిల్ల ఇతఃపూర్వము గోరుచుండెనుగాక ఇపుడు పుత్రవ్యామోహముగుపరచెను. అందునభక్తపరాధీనత తెలిసి పరిశీలించనిచ్ఛగించితి నని ప్రత్యుత్తర మొసగెను.

అనివచించిన వశిష్ఠువాక్యము లాలించి త్రిశంకుడు గురునకే న్యా నారదుండు తదనంతర మేమిచేసెను. నారదుని జన్మ మాదిగాగల వృత్తాంతము సవిస్తరముగా వినుటకు కోరిక వొడమినది. అన తక్షి యా కథా కథన దక్షుండగు వశిష్ఠుండు చెప్ప దొడంగె.

## —: నారదుని వృత్తాంతము. :—

—:—:—

త్రిశంకమహారాజా! వైకుంఠమునుండి నారదుండు వెడలిపో యి త్రిమూర్తులు బాలురగుట నెఱింగెను. మిగుల సంతసము నొందె ను. తనలో తానిట్లు తలపోసెను. దెలిపెద వినుము,

శ్లో॥ ప్రథమంతారకంచైవ ద్వితీయం దండ ముచ్యతే। తృతీయం కుండలాకారం చతుర్థం చార్థచంద్రకమ్। పంచమం బిందుసంయుక్తం ఓమితిజ్యోతిరూపకమ్॥ ఓం అనుదానియొక్క యుత్పత్తి యని తాత్పర్యము.

శ్లో॥ అనాహతస్యశబ్దస్యతస్యశబ్దస్య యోధ్వనిః। ధ్వనేరంతర్గతజ్యోతి। జ్యోతిరంతర్గతంమనః। తన్మనోనిలయంయాతి తద్విష్ణోఃపరమంపదమ్॥ సనాతమగునదియే, అనాహతము. దానినే బ్రహ్మమందురు.

అట్టిబ్రహ్మమే ప్రణవము. అయ్యదియే స్వయంజ్యోతి ఆతే జోమయపరబ్రహ్మమునందు శబ్దము. అందున, ధ్వని, దానియంతర్గత మందుగలదియే, నిశ్చలబ్రహ్మము. ఆపరబ్రహము, రజ, స్సత్వ, త మో గుణాతీతుండై త్రిగుణసహితుండై సృష్టిస్థితి సంహారాదిభారక త్వమువహించినవాడై బ్రహ్మవిష్ణుసదాశివులను నామరూపములునొ ప్పినవాడై భాసిల్లుచు మాయాతీతుండయ్యెండెను. ... ...

ను విష్ణుచారిత్రములు చదువుచు వినిపింపుచుఁ బాడుచు, నర్చించుచు, నుంత శాంతిమతియై పరిపూర్ణభక్తితో విష్ణుసేవారతుండై విహరించు చెను. కొంతకాలమునకు, యమ్మహాత్ములగు యోగిజనులమూలంబు న రజస్తమోగుణ పరిహారిణియైన భక్తిసంభవించి యీశ్వర రహస్యార్థ విజ్ఞానము గలిగెను.

ఇటులుండఁ బుత్రుని మాతమాపు రేపును, మోహంబు సొంపార, ముద్దాడుచు, ముంచుకున్నచు దేహంబు నివురుచుఁ గౌఁగిటఁ జేర్చుచు తనాలయం బలసి సొలసియాకొంటివా! యని బలుక శుశ్రూష సేయ కష్టముగా నుండెనని దెలసిన మారుచింతలేక హరిభక్తిజ్ఞానసంపన్నుండై యుండెను. యేదేశ్లప్రాయమున వానిమాత సర్పదష్టయై విగతజీవితయగుటచేఁ దగుకృత్యములొనరించి పిదప గురువులనాజ్ఞగొని యుత్తరాభిముఖుండై పురంబులు బట్టణంబులు గ్రామంబులు పల్లెలు మందలు, మహోద్యానంబులుఁ గిరాతపుళిందనివాసంబులు వనంబులుఁ జిత్రధాతువిరచితంబైన పర్వతంబులు పథికజన శ్రమాతిరేకంబులయిన తటాకంబులు, బహువిధవిహంగనినద మనోహరంబులై, సరోవరంబులై వికచారవింద మధుపానపరవశపరిభ్రమద్భ్రమరసుందరంబులైన సరోవరంబులుఁ దాటిచనుచుఁ క్షుత్పిపాసాసమేతుండై నదీప్రవాహంబునఁ గ్రుంకులిడి శుచియై నీరు ద్రావి విగతశ్రముండై యట సాలవృక కపి భల్లూక గోలేభ శల్య ఘూక శరభ శార్దూల శశ గవయ ఖడ్గ వ్యాళాజగరాది మృగముల ఘీంకారములు గల వనము జొచ్చి యందు సుస్థిరంబైన గుల్మలతా గహనంబుల పొంతనొక్క రావిమ్రాఁకు క్రిందఁ గూర్చుండి భయంబించుకయు నొందక తన హృదయగతంబున పరమాత్మ స్వరూపుని హృదయమందు నిలిపి ఇట్లు స్తుతించె

కం॥ పలుకుల జగవుల నడపుల। నలుకల నవలోకనము లనాథీర వధూ। కులముల మనములతాలిమి। కొలుకుల వదలించుచునుని గొలిచెదమదిలోన॥

విధ్యానసంపన్నుండౌను. బాలుని నిశ్చలభక్తికి సంతసించి నారాయణుడు సాక్షాత్కరించి బాలకా నీభక్తికి మెచ్చితి నీవు దిక్కుమాలిన దాసనని భావించి శోకింపకుము. శీఘ్రకాలమున నీజన్మవిముక్తి నొందగలవు. క॥ నాయందు కలుగు నీమతి । నాయెడ జన్మాంతరముల బాలక నీకున్ । బాయంబు విడదీయరాదట । మాయను మతిబుట్టగలవు మద్భక్తుండై ॥

మ॥ వినుమీ సృష్టియుగంబునందే యుగము తీర్ణోన్నకాలంబు యానిమిత్తమై పోయెడిఁ బోవగాఁగలుగుంజూ విష్ణు మీమీద నా సృష్టియుం । మునిరూపస్మృతితోడఁ బుట్టెదవు నిర్దోషుండవై నాకృప । ఘనతం జెందెదు శుద్ధసాత్వికులలో గణ్యుండవై యర్భకా ॥

అని పలికి యదృశ్యుండయ్యె. అనంతరమా బాలుండు నిర్మలాంతఃకరణంబుతోడ విషయవిరక్తుండై కాలమున కెదురు చూచుచు భూమిం దిరుగుచు నుండు నంత గొంతకాలంబునకు మెఱుపు మెఱసిన తెఱంగున మృత్యువు పొడచిన పంచభూతమయంబును గర్మస్వరూపంబునైన దేహంబు విడచి శుద్ధసత్వమయంబయిన దేహంబు సొచ్చి బ్రహ్మనిశ్వాసంబు వెంట నతనిలోన బ్రవేశించి లోకంబులు సృజియించు కాలమున లోనుండి వెడలెను. ఇక్కారణమున నె బ్రహ్మమానసపుత్రుండన బఱగుచుండెను. ఈశ్వరునిచే గానవిద్యాభ్యాసము చేసికొని మెప్పొందదనెను. అంగనకే బ్రహ్మాభివ్యంజకంబులయిన సప్తస్వరంబులు దనయంతనె మ్రోయుచున్న వీణ లభించెను. ఆయాలాపములం జేసి విష్ణుని పరమహాత్మ్యమున నారదుడను నామము గలిగె. తదాది నారాయణకథాగానంబు సేయుచు జరియించుచుండెను.

—✱ నారద వివాహము. ✱—

ఒకనాడు చతురాననుడు పుత్రవాత్సల్యమున నారదుని జేరి కుమారా నాహితము చక్కగా వినుము. సృంజయుడను రాజచంద్రునకు రూపలావణ్యయు సుగుణయు మఱియు భక్తిభావము లొప్పినది

యు నగు నొక కొమరిత జన్మించెను. అక్కుమారి దినదిన ప్రవర్ధమా
నయై ప్రకృతము వివాహ వయస్క యగుటచే నానాదేశపురాకొమా
రుల రూపపటముల వెప్పించి కన్యకకు జూపెను. ఆమె యాపటములు నెవ్వా
నొల్లకనులబాడక జనకునిపల్కులకు ప్రత్యుత్తర మీయకుండుటచే తం
డ్రి మిక్కుటముగా శోకమున మునిగియుండెను. నేయునొక్కటియు లే
క ఏకపుత్రియు తరుణవయస్కయు భక్తి విశారదయు గాను నగను
సహింపలేక ఒకనాడు సుతను రావించి లాలించి ప్రేమతో కుమారి
ధర్మము నీవెఱుగదగదు. నీమనోహరునితో గూడి సౌఖ్యమనుభవించుచుండ
గాంచు భాగ్యముగల్గ జేయుని కారణమెయ్యదియో యానతీయవలయు
నని వాక్రుచ్చెను. కన్య సిగ్గుచేతలవంచి కొంతసేపటికి నాయనా నేను
డి వఱకెన్నియో పర్యాయములు భగవంతు గానియన్యుల మొగము
చూడను. పలుకరింప నని నుడివి యుంటినే మరల ప్రశ్నింపనేల

మత్తకోకిల. దైవమాతఁడె నన్ను నేలెడిదాత యాతఁడెసుమ్మినా।
భావమంత హరించి యుండిన భాగ్యదేవత యాతఁడే । గాన
నన్ మహారాజసూనుల గాంక్ష నేయను బాలుగా తీవరింపగనే
ల తండ్రిరో దివ్యరూపుని గూర్చుమా ॥

వ ॥ అనిపల్కుచుండెను. భగవంతుని ప్రార్థించుటకంటె వేఱుమా
ర్గము లేదని కృతనిశ్చయు డయ్యెను. తత్క్షణమే భక్తిశ్రద్ధాగరిష్ఠుడై
నారాయణుని గూర్చి తపమాచరించెను. సర్వేశ్వరుడు సాక్షాత్కరిం
చి స్వంజయా నీభక్తికి మెచ్చితి. నావరంబున నీకు జననమైన పుత్రిక
పరమ భాగవతోత్తముండు శీఘ్రముగ తనంతట తానే నిగ్రహాంబున
కు విచ్చేయును. నీవు తపము చాలించి వైవాహికమునకు దగుసన్నా
హము జేసికొనుము. నిస్సంశయముగా సర్వసంభారములు గూర్చు
కొనుమని పలికి అంతర్హితుం డయ్యెను. అనంతర మారాజు సర్వ
మునిశ్చయ మఱుముకొని యున్నాడు. కావున నీవాకన్యను పరిణయముగా
చేసుకొనుము. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసంబులలో

ఉత్తమంబగు సదిగృహస్థాశ్రమము.

గృహిణీ గృహ ముచ్యతే. ధన్యో గృహస్థాశ్రమః

అను వచనముల ననుసరించి ఒకయువతిని వివాహము జేసుకొనుటపురుష ధర్మము. గృహమేధియైన పిదప యథాక్రమముగా స్నాన తర్పణ సంధ్య జప దేవపూజాగ్ని హోత్ర వైశ్వదేవ బలిహరణంబులు నిర్వర్తించి అన్నార్థులైన అభ్యాగతుల పూజించి ప్రశస్త మణి ముద్రికా ధరుండును ధవళ వస్త్రయుగ్మపరివృతుండును గంధపుష్పాలంకృతుడును శుద్ధోదకార్ద్ర పాదహస్తుండును ఆచమన క్రియాపరిశుద్ధ వదనుండునై యపరదిశాముఖుండుగాక పూర్వాభిముఖుండై సుఖాసనంబునగూర్చుండి, ప్రశస్తశుద్ధపాత్రంబులందు, సర్వగుణసంపన్నయైనధర్మపత్నివడ్డింప, పుత్ర, బంధు,మిత్ర, సహితుండైభుజించి, యుచ్ఛిష్టవారణార్థంబుగాఁ, పాణి, పాద, ప్రక్షాళనంబు జేసి, స్వప్రశాంతచిత్తుండై కూర్చుండి, యభీష్టదేవతాస్మరణ జేసి, వేదశాస్త్ర ప్రసంగంబుల, భగవద్గుణానుకైంకర్యంబుల, ప్రొద్దుబుచ్చుచుండవలయును. ఇటుల నీతిపరుండై కులాచార ధర్మంబు వదలక ధర్మార్థకామంబు లయందు సమధర్మియై పాప కర్మంబులు పరిహరించి సమస్త భూతంబులయందు స్నేహార్ద్రచిత్తుండై అరిషడ్వర్గంబునందు బద్ధుండుగాక సదాచార సంపన్నుండై సాత్వికంబు వదలక త్రికరణ శుద్ధిగా వర్తించు పుణ్యపురుషుండు సర్వోత్కృష్టుండుగా నెన్నబడు నను వాక్యములు గమనింపుము. ఏయాశ్రమము జేరక యుండుట లెస్సగాదు కావున జనకుని వాక్య పరిపాలనా శీలుండవై విష్ణు భక్తురాలగు రాకొమరితెను వివాహ మొనరించు కొనుము,

శ్లో॥ స్నానం తర్పణ సంధ్య హోమ జపితే కిం తేన దానం
వినా। నానాశాస్త్ర పురాణ వేదపఠితే కిం తేన జ్ఞానం
వినా। వీణావాద్య మృదంగ గీతపఠితే కిం తేన గాత్రం
వినా। తాంబూలాదిసుగంధపుష్పశయనేకిం తేన కాంతావినా

అనెడి నీతివాక్యము తప్పక నాచరణీయము. పితృవాక్య పరిపాలన విధికృతము. దైవపిత్రు హితము. భక్తిజ్ఞానములకనువగు కృత్యము. అనినుడివెను బ్రహ్మవాక్యములకు సంతసించెను. అంతచతురాననుఁడు దేవేంద్రుడు మొదలగు వేల్పులరావించి నారదసహితముగ సృంజయరాజుపట్టణమునకుబోయి. పురము వెలుపల నిలచి, మంగళవాద్యములు మ్రోగించిరి. రాజు పట్టరానిసంతోషమున, వరపూజకు సపరివారముగావచ్చి, బహూకరించి దోడ్కొనిచని, విధ్యుక్తముగా, వివాహమంగళ ప్రయత్నముగావించె. కన్యాదానసమయమునరత్నభూషణములే గాక తనరాజ్యసర్వస్వమును ధారపోసెను. పెండ్లికొమరునివెంటనేతెంచిన, బ్రహ్మమొదలగు దేవతలకుఁ, దగురీతికట్నములిచ్చెను. బ్రాహ్మణులు మొదలగువారలకు, మృష్టాన్నంబుల సంతుష్టిగావించెను. దేవతలు దివ్యదుంధుభులు మ్రోయించిరి. అప్సరసలాడిరి. గంధర్వులుపాడిరి. మునులు బ్రహ్మ వధూవరుల నాశీర్వదించి నిజనివాసములకు బోయిరి. వేల్పులుయథేచ్ఛముగాపురములకేగిరి. అనంతరమా నారదుఁడు. సుగంధిచందనార్చితంబయిన, రమ్యపుష్పతల్పంబున పత్నితోఁగూడి, మదన క్రీడలు సల్పుచు, సృంజయరాజుపురమున సుఖంబుగా నుండెను.

—:(. నారదునకు సనత్కుమారుఁడు జ్ఞానోపదేశము జేయుట. ):—

ఒక నాఁడు, సనత్కుమారుండా సృంజయరాజు పట్టణమునకరుదెంచెను. నారదుఁడు సగౌరవముగ దోడ్తెచ్చి గూర్చుండనియమించెను. ఆమహాఋషి తనదివ్యదృష్టిచేఁ నారదునివృత్తాంతమంతయు నెఱిఁగెను. భక్తినిబురిగొల్ప మదియందు దలపుజనించెను. ఇంతలోనా రదుండు, మహాత్మా! భవదీయాగమనంబున ధన్యుడనైతిని. నేనీసంసారంబున తగులంబడియుంటిని. నాకు విముక్తి మార్గమగుపడకున్నది. కృపతో ననుగ్రహించుమని ప్రార్థించెను.

అనంతరమా ముసిపుంగవుండు, మందస్మితవదనారవిందుండై

నారదా : నే వచించెద వినుము.

తొల్లి నీవు గంధర్వజన్మంబునఁ గామినీసుఖ మనుభవింపఁగోరి యుంటివి. ఆకాంక్ష నీమనంబున బూర్తిగాకుండెను. తదుపరిదాసీపుత్రుండవై, హరిభక్తసంగమంబున, బ్రహ్మమానసపుత్రుండవై, భక్తాగ్రేసరుఁడ వగుటచే మనజనకుని కృపాకటాక్షమున ననుభవించితివి. ఘోరసంసృతిబంధకారణంబగు, సంసారంబను దగులంబున జ్ఞానము వీడియుండుట తగదు.

గీ ॥ గర్భవాసబీజంబు దుర్గతికిఁద్రోవ । అమితపాపాత్ముఁడైన నరాధముండు । కరము సుధయనుబుద్ధిచే గరళరసము । ద్రావిన విధంబుగాదె కాంతలసుఖంబు ॥

క ॥ పరుఁడగు నారాయణుఁడా । మఱచివిషయలోలుండైన మనుజుఁడుమాయన్ । దరియింపలేకగరళము । గుఱుతుగ నమృతమను బుద్ధిఁగ్రోలుంగాదె ॥

కావున, మాయాస్వరూపమగుపురమును కాంతనువీడి యోగనిష్ఠాగరిష్ఠుండవగుమని మంత్రరహస్యార్థములు దెల్పిజనియెను. అనంతరము రాజు, యల్లుని బిలచి తనకు వార్ధకదశవచ్చెనని పుత్రులు లేరుగావున, రాజ్యపట్టాభిషేకము జేసుకొనుమని గోరెను. అందులకియ్యకొనక భార్యమొదలగు వారలు వద్దనివారించినను, పురమువిడచి వెడలి పోయెను. శ్రీమన్నారాయణా ! ఆర్త్రత్రాణపరాయణా ! సకలపాపవినాశనా ! నాకు బ్రసన్నుండవై సాతత్యూ నైరించి నన్ను రక్షించుము.

క॥ అవివేకిసంసారవ్యవహారమునందుకల్గువాంఛనిరతమున్ ! భవదీయపదంబులపై దవులన్వరమిచ్చినన్ను దయజూడగదే ॥

అని ధ్యానింపుచు వైకుంఠమార్గమునుబట్టి బోవుచుండెను. త్రిశంకచక్రవర్తి పిదపజరిగిన చర్యవినుము. ... ...

—.(చంద్రుండు ప్రచేతసులకు మరీషియను కన్యనిచ్చుట.)—

పృథుచక్రవర్తి రెండవకొమరుండగు నంతర్ధికి శిఖండియందు హావిర్ధానుండుపుట్టె. వానికి నాగ్నేయియైన ధిషణయను దానికి నొక్కతనయుండుపుట్టె. వాడుకుశలుండై యజ్ఞకాలంబునఁ గుశనిచయంబుఁ బ్రాచీనాగ్రంబుగా నొనరించుటం జేసి ప్రాచీనబర్హియనం బరఁగె. అట్టిప్రాచీనబర్హికి సముద్రపుత్రియైన సౌవర్ణయనుదానికి ధనుర్వేద పారగులగు ప్రచేతసులు పదిమంది జనించిరి. వారుపృథగ్భేదంబులేని ధర్మంబులం బ్రవర్తిల్లుచుండిరి. ఇటులుండ నొకనాడు కుమారులతో బ్రాచీనబర్హి యిటులనియెను.

తే॥ గీ॥ వేఱులేవిధర్మంబుల విస్తరిల్లు। మీకుఁబడయంగరానిదేమి
యును లేదు। కాన నాయాజ్ఞఁబూనియుగ్రంపుఁదపము। స
లిపి పంకజనాభుం బ్రసన్నుఁజేసి॥

తే॥ గీ॥ భావికాలంబునకుఁబ్రజాపతివిలాస। ములువహించిచరాచ
రభూతసృష్టి। సర్ధింగావింపుఁడనుటయు నట్లుగాక। యని
యొప్పబడిరందఱు నధికభక్తి॥

పితృవాక్యపరిపాలనకై సాగరముకడకేగిరి. సాగరోదకమధ్యను ప్రబాధంబున పదివేలవత్సరములు నారాయణునిగూర్చి ఘోరముగుతపమాచరించిరి. అట్టితపమునకుమెచ్చి భక్తవత్సలుండు శంఖచక్రగదాశార్ఙ్గములు పట్టుపీతాంబరముధరించి, వారియెదుటసాక్షాత్కరించి యోబాలులార నీభక్తికి మెచ్చితి. తపము చాలించి మీకు వలయు వరములఁ గోరుఁడు. అన వారలు సమాధినిష్ఠ చాలించి లేచివందనములాచరించి,

ఉ॥ ఓకమలామనోరమణ యోజగదేకపవిత్ర యోశుభా
లోకన యోపయోజదళలోచన యోమహనీయ కౌస్తుభ
స్వీకృతవక్ష యోసుగుణశేఖర యోకరుణాపయోనిధీ
మాకుఁ బ్రజాపతిత్వములు మన్ననతోడ ననుగ్రహింపవే॥

ని ప్రార్థించిరి. నారాయణుండు మీరుకోరినవరములు మీ కుంగలుగంబోవు. మీపుత్రుని యందనుగ్రహించితిమి. ఆతండుదక్ష నామంబునం, ప్రజాపతియగునని వరంబిచ్చి, యంతర్ధానంబునుంబొం దె. ప్రచేతసులు పురముంజేరిరి. అరాజకముగనుండుటచే రాష్ట్రమం తయు, నడవులు పెరిగి, ప్రజాక్షయమగుట నెఱింగిరి. తపోమహాత్వం బున ఝంఝానిలంబులుగల్పించి మహీరుహంబుల, నిర్మూలంబుగా భస్మీభూతంబు జేయుచుండిరి.

అత్తరి చంద్రుండు,

సీ॥ ముఖమను శశిబింబమునకుం గస్తూరికాతిలకకళంకంబు చెలు
వుమెఱయ । ధమ్మిల్లమనుగాఢతమసంబులోఁ బుష్పచయ
తారకావళిసారుమీఱం । గనుచూపులను మన్మథునిమో
హనాస్త్రంబులందుఁ గాటుకమచ్చసంతరింప । శృంగారము
ను సుధాసింధుమధ్యంబున వళితరంగశ్రేణివన్నె కెక్క ॥

గీ॥ ఘనకుచములనుకిన్నెరగాయలకును । బట్టుపయ్యెదగప్పుసైన
బాగుసూప । సకలసౌభాగ్యలక్షణచారుమహిమ । నుల్లసి
ల్లెడుకన్యకనొర్తుఁదెచ్చి ॥

క॥ మానవపతి నందనులకుఁ । గానుకగానిచ్చి వారిఘనకోపం
బుల్ । మానిచి వినయవిధేయులైన । లినవినోదవారికని
రెం ప్రీతిన్ ॥ వి ॥ పు ॥

రూపలావణ్యాతిశయ యగు కన్యాలలామను దెచ్చి "రత్నహస్తేన నో పేయాద్రాజానం దైవతం గురుమ్" అనియున్నది. కావున రాకొమరులా రా ! యాకన్యకాలలామను కానుకగాగొని మీకోపానలంబు జల్లార్ప దు "ఉత్తమస్య క్షణంకోపం" బనునది గమనింపుండు. ఈకన్య కడు పూతచరితగ నెఱుంగుడు. ఈమెజననవృత్తాంతము వినుడు.

కంఠుండను మునిచంద్రుండు, గోమతీతీరంబున, ఘోరతపంబు సేయుచుండ నెఱింగి యాతని తపోమహాత్వంబునకు సంక్షోభించి దేవేంద్రుండు, ప్రమ్లోచయను యప్సరసకన్యను, తపము చెఱచుటకుఁబం

సుశర్మేంద్రుండు, జేసినకపటము. ఇంతకాలమునాతోఁ గూడి యుంటివిగాన నాకోపము పశమించుకొంటిని. నీవీతక్షణమున వెడలిపొమ్ము. లేదేని, నాశాపమునకు లోనగుదువు. అనుమునీంద్రుని కోపాస్యులొలుకు కరుంగవలంగాంచి భయాకులిత మానసయై చిఱుచెమ్మటలు నిండి యొడలెల్లవడంక. బదులు పలుకక, గగనంబున కెగసెను. లేఁతమూలుగల గర్భంబగుటచేస్రవించి, శరీరంబునవయవంబులయందు నమృతవీర్యంబు, స్వేదరూపంబుననుద్గమించెను. చంచలాక్షి బాలతరుపల్లవంబులఁ జెమటఁ దుడుచుకొనుచు. దేవలోకంబునకు నరిగెను.

క॥ మునుకణ్వునకును బ్రహ్మా। చనకు సమీరునకు నాకు సా
లంబులకున్ । వినుడొక్క రూపమారిష । యనఁబరఁగిన
యీమృగాక్షి కతివలు సరియే ॥

క॥ తరుపల్లవములసమ్మతి । వరువీర్యము నిలిచి వాయువశము
న నమృతతో । త్కరమగు నాకిరణంబులఁ । బరివృతమై
యీలతాంగి ప్రభవించె నొగిన్ ॥

కావున, వృక్షరక్షణార్థంబుగా నీమృగాక్షిం బాణిగ్రహణము జేసుకొనుడు. ఈమె పూర్వ జన్మవృత్తాంతము వినుడు.

—: మారిష పూర్వజన్మవృత్తాంతము :—

ఇది తొల్లిధరణీవల్లభుని యిల్లాలు. బాలవైధవ్యమునందు, హరినిగూర్చి భక్తిసల్పినంత, ప్రత్యక్షంబై వరములుగోరుమన, పతి పతి యని పదిమారులుచ్చరించ, ననుగ్రహించెను. అయోనిజవై జనించి, ప్రజాపతిత్వము గల పుత్రుని బడసి మహావిభవములనుభవింపవలెనని నయ్యదియు నిచ్చి. బ్రహ్మణ్యదేవుండంతర్హితుండయ్యె. సత్కారణమున, నీరీతి యీజన్మమెత్తెను. ఈమెను మీరు పరిగ్రహించిన, మహాభాగుండును, నతివీర్యపరాక్రముండును, ప్రజాపతి గుణోపేతుండును, నైన కొడుకుదయించును. చరాచరముల నిర్మింప సమ

ధురంధరుడు. భావికాలకార్య గౌరవంబులకు మీకు ననుకూలము గలదు. కావున, నీమెను మీరు పదుగురు వరించుడు గావించి దక్షా నుడని కొడంబరచి పాణిగ్రహణము జేయించెను.

—:దక్షప్రజాపతి జననము:—

క ॥ ఆ రాజన్య తనూభవు । లారమణిం బరిగ్రహించి రాసలినవ
నగ । నీరజ భవనిభుని మహో । దారుని బుత్రకు నొకనిఁ
బడయుండనగ ॥

ఆదక్షప్రజాపతి దేవ దానవ గరుడ గంధర్వ సిద్ధవిద్యాధరాది నానాభూతంబులను ద్విపాద చతుష్పాద నానాజంతుజాలంబులను బుట్టించుచుండెను. అతండు మహాతపోనిధి గావున దక్షునకెవ్వండును గల్పంబులు లేవు. సృష్ట్యర్థంబుగా ప్రతిమన్వంతరంబునందును యుగంబులను కొక్కొక్క ప్రజాపతి దక్షనామంబున జన్మించి సృష్టికిం గర్త యయ్యెండు గావున ప్రచేతస పుత్రుండైన దక్షప్రజాపతి పరబ్రహ్మ దక్షిణాంగుష్ఠమున జన్మించెనను ప్రతీతిగలిగి పూజ్యుండయ్యెండెను.

—:దక్షకుమారులకు నారదుడు జ్ఞానోపదేశము చేయుట:—

కం ॥ బహువిధముల బహుముఖముల । బహురూపములైన ప్రజ
ల బహులోకములు । న్బహుళముగ జేసిమదిలో । బహుమానము నొం
దడయ్యె ప్రఖ్యాతముగన్ ॥

ఈవిధముగ దక్షప్రజాపతి ప్రజాసర్గముచాలక చింతించి మాంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టుం జేయనెంచి సర్వదురిత హరణంబగు వింధ్యపాదమునం దఘమర్షణంబను తీర్థంబు గాంచి యట ఘోరంబయిన తపంబు సేయుచు హరిం బ్రసన్నుఁ జేసికొని హంసగుహ్యంబను స్తవరాజంబున నారాయణుని.

"గీ ॥ తవిలి గుణముచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కానరాని నెలవువాని,
మొదలఁ దానకలిగి ముక్తిమానావధి
రూపమైన వాని ప్రాపు గొందు ॥ "

వ॥ వాగ్బుద్ధీంద్రియ మానసంబుల చేతం జెప్ప నిట్టిదని చూపింపనలవిగాక యెవ్వాని — గుణరూపంబులు కర్తృలేని నెవ్వానియందు సర్వంబును నెవ్వాని వలన సర్వంబు నుత్పన్నంబగు — నెవ్వాని వలన స్థితిం బొందు నెవ్వాని వలన లయంబగు ———————— బరాపరంబులకు బరమంబై యనన్యంబై ప్రాక్సిద్ధంబై సర్వవ్యాపకంబై యనాదికారణంబై యున్నతత్వంబు నాశ్రయించు నెవ్వాని ప్రభావంబు మాటలాడెడు వారలకు వాదంబు సేయు వారలకు వివాదస్థానంబులగుచు నప్పటప్పటికి మోహంబు నొందించుచుండు నట్టియనంతగుణంబులు గల మహాత్మునకుం బ్రణామంబు సేయుదు, "అస్తి" "నాస్తి" యనువస్తు ద్వయనిష్ఠలం గలిగి యొక్కటన గలిగి యుండి విరుద్ధధర్మంబులుగనుండు నుపాసనా శాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపందగిన పరమంబు నాకు ననుకూలంబగుం గాక యెవ్వండు జగదనుగ్రహంబు కొఱకు జన్మ కర్మంబుల చేత నామరూపంబు లెఱుంగబడుచుండు నట్టి నామరూపంబులు గలిగి తేజరిల్లు ననంతుండైన భగవంతుండు ప్రసన్నుండగుం గాక యెవ్వండు జనుల పురాకృత జ్ఞానపథంబుల చేత నంతర్గతుండై మేదినిం గలుగు గంధాది గుణంబుల నాశ్రయించిన వాయు భంగి వెలుంగుచుండు నాపరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబు సేయుం గాక యనుచు భక్తి పరవశుండై స్తుతియించెను. భక్తవత్సలుండైన పరమ పురుషుండు నిజరూపము గనుపఱచెను. దక్షప్రజాపతి సంతోష మపార మాయెను. సాక్షాత్కరించిన సర్వేశ్వరుని సర్వాతిశయంబయి మహదాశ్చర్యకరంబయి తేజరిల్లు దివ్యరూపము గాంచి భయంబును హర్షంబును విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పుదప్పింపం దెప్పిరిల్లి కప్పురపాటసంబుడమునై సాగిలంబడి దండప్రణామంబు లాచరించి కరకమలంబుల మొగిడ్చి నెలదేరులతోం గొట్టుపడి యిట్టట్టు చాలక నిట్టవోడిచి మున్నిరుండున్ని విలిచిన వెన్నరునుంబోలె సర్వాంగంబులుం దొంగి

లించి చిత్తంబునాత్మాయత్తంబు జేసి పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను నత్యంత సందేహ పావకంబులైన సవ్యాఖ్యానంబు లుగ్గడింప నతిసత్ఫలంబులైన తదీయ కర్మంబులు దపంబను విబుధహర్ష కరంబులైన తత్స్వరూపంబులు పొగడను నాశ్చర్య మనోరథంబు హాత్రువ్వనోపక ప్రజాకాంక్షులై యూరకున్న ప్రజాపతిం జూచి సర్వజీవ దయాపరుండును సర్వసత్వహృదంతరుండును సర్వజ్ఞుండును గావున నతని భావంబు దెలిసి జగన్నాథుండార్త పోషణంబులైన భాషణంబుల

క॥ మెచ్చితి ప్రాచేతస తప। మిచ్చట ఫలసిద్ధియయ్యెనిట్టితిభక్తిన్।
నెచ్చెలి నవ్యారవిభవము। నచ్చెరువడంబొందినెవఁడగ్యాడుజగతిన్॥

గీ॥ తపముచాలునింకదగ భూతతతికి. విభూతులొనరుగాకపొందుపడగ
విధియసమ్మ మాకు నిచ్చలోగల కోర్కె। పొసగ నీదువలన
బొందు పడితె॥

వ॥ మఱియువినుము. బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులు నింద్రులును వీరలు నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన మద్భూతి విభవంబులు మఱియునాకు యమ నియమాది సహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు సాంగజపవధ్యాన రూపంబగు విద్య శరీరంబు ధ్యానాదివిషయ వ్యాపారంబుగానుండుభావనాది శబ్దవాచ్యంబగు క్రియయాకృతియు క్రతుజాలంబులంగంబులు ధర్మంబాత్మ దేవతలు ప్రాణంబులు నిగమంబు మత్స్వరూపంబు జగదుత్పత్తికి నాదియందు నేనొక్కడన తేజరిల్లుచుంటి బహిరంతరంబుల వేఱొక్కటి లేదు. సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనంబగుటం జేసి సంజ్ఞానమాత్రుండ నవ్యక్తుండను గానుండు జీవుని భంగి నొక్కడనైయుండుదు. అనంతుడనైయనంత గుణంబులుగల మాయాగుణంబు వలన గుణవిగ్రహంబగు బ్రహ్మాండంబు నయోనిజుండు స్వయంభువుండగు బ్రహ్మయును నుదయించిరి. మదీయవీర్యోపబృంహితుండయి

హాదేవుండగు నాబ్రహ్మ యనమద్ధుని బోలె సత్యతాద్ధమన్యమాన మనస్కుండై సృష్టింపనుద్యమించుతరితపంబాచరింపుమని నాచేత బోధితుండై యటుసలిపి తొలుతసృష్టికర్తృత్వంబువహించి మిమ్ము సృజియించెను. పంచజనుండగు ప్రజాపతి తనూజయగు యసిక్ని యను పేరిట వినుతినొందియున్న యికన్యకను నీకిచ్చెద. దీనింబత్నిగాఁ గైకొనిన మిథునవ్యవాయ ధర్మంబుగలవాడవై మిథునవ్యవాయ ధర్మంబుగల యీనాతియందు ప్రజాసర్గంబు నతివిపులంబుగ గావింపంగలవాడవు. అనిబలికి విశ్వభావనుండైన హరిస్వప్నోప లబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందెను. అనంతరము దక్షుండు యసిక్నియను నామెయందు నైదువేల పుత్రులగాంచెను. ధర్మశీలురైన యబ్బాలురు పితృనిర్దేశంబున ప్రజాసర్గంబుకొరకు, సింధుసముద్ర సంగమంబున, సమస్త దేవముని సిద్ధగణసేవితంబై, దర్శన మాత్రంబున నిర్ధూతకల్మషులను, నిర్మలచిత్తులఁజేయు, నారాయణ సరస్సు సమీపమున, నిర్మలాంతరంగులై, పరమహంస ధర్మమునందు, నుత్పన్న మతులై, తపంబులు సల్పుచుండిరి. నారదుఁడచ్చోటి కేతెంచి, వారియభిప్రాయంబెఱింగి,

క॥ జలజ భవాదుల సర్వముఁ । గలయంగాఁజూచి దేశకాలక్ర
మముల్ । తెలియక ప్రజఁబుట్టింపం । దలఁచుట మీకెల్ల
నుచితము గాదె ॥

క॥ నిజముగ పరమాత్ముండిటు । నుండంగా నెఱుగలేక యో
గుల మనుచుఁ । యెండల వానల మంచుల । నుండినమో
క్షంబు లేదు యుర్వీ రమణా ॥

అనుటు వీరెఱుంగ కుంచుట కడువిచారము జనించినది. విదేహా కైవల్య మార్గము దెలుపుట మేలుగాదు. అన నారలట్టి మార్గముఁ బ్రసాదింపుమని, వేడిరి. అంత నారదుఁడు చెప్పఁ దొడంగెను. బాలులారా! శ్రద్ధతో నాలింపుఁడు. సకల ప్రాణులకును, స్థూ

ఈశరీరములతోడి పుట్టుకతోనె మరణము కలుగు చున్నది.

శ్లో॥ జాతస్యహి ధ్రువోమృత్యుర్ధ్రువంజన్మ మృతస్యచ । అద్యవాబ్ద శతాంతేవా మృత్యుర్వై ప్రాణినాంధ్రువః । అనిత్యాని శరీరాణి విభవా నైవ శాశ్వతః । నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మ సంగ్రహం ॥

అను, ప్రమాణము వలన, ఈస్థూలదేహమునకు, మరణము తప్పక కలుగును. మీరు ప్రయత్నించు చుండు జీవకోటి నశించున దేగాని, శాశ్వతముగా నుండునది గాదు.

శ్లో॥ స్వప్నే స్వాంతర్గతం విశ్వం । యథా పృథగవేక్షతే ।
కో జాగ్రతి విశేషోస్తి । జగచేత ద్వ్యమృశ్యతాం ॥

వ॥ అను ప్రమాణము చేత పురుషుండు స్థూల దేహావస్థయైన జాగ్రతలో నున్నప్పుడు తాను చూచిన దేవతలు రాజులు మొదలగువారును తానువిన్న దేవేంద్రాదుల వృత్తాంతములును సూక్ష్మ దేహావస్థయైన, స్వప్నములో తనకే తోచినట్లుగా, తనచేత చేయబడినవన్నియు నటులనే యుండును. "జ్ఞానాని సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా." అనువాక్యము గుర్తెఱింగిన పరబ్రహ్మ సాలోక్య, సారూప్య, సామీప్య సాయుజ్యములు బొంది శాశ్వత సుఖానందము జెందుదురు. కావున, విదేహ కైవల్యమునకుఁదగు, మంత్రమును జపించుమని, అష్టాక్షరి బోధించెను. వారామంత్రరాజమునన్నుష్టించిరి. తక్షణమే సహజ సత్వబ్రహ్మ మయమైన, యానంద మనుభవింపజేరబోయిరి.

నారదునివలన సుతులు బ్రహ్మపదంబు జేరుటవిని పలువిధముల శోకించు దక్షునికడకు చతురాననుఁడేతెంచి దుఃఖోప శమనము గావించెను పిదప రెండవ భార్యయగు వైతరణి యందు శబళాశ్వులను కుమారుల, నేవురబుట్టించెను.

వారలు తండ్రిపనుపున నారాయణ సరస్సను పుణ్యతీర్థమున కేగినటు

నొంటిపాదముపై నిలచి నిశ్చలహృదయుఁడై కొంతకాలము వాయుభక్షణుఁడయియు మఱికొంతకాలము నిరాహారముగను జీవిత [illegible] భీతికరముగ ఘోరతపముం గావింపఁ దొడఁగెను. మఱలయటకు నారదుఁడేగి, వారలకు భ్రాతృవత్సలుఁడై యున్న వేదాంతసారంబు గ్రహించి తోఁబుట్టువులు జనిన మార్గంబునఁ జనవలయు.

అగ్రజులు గన్నమార్గంబునఁ దప్పక వర్తించునట్టి వాని విశేష మపారము. అట్టివాఁడు సతతంబును బుణ్యబంధుఁడై సర్వ కర్మల యందు నిర్మోహితుఁడై పరమపద నివాసులగుట సత్యము. అని బలికిన వారలు నట్టిబోధకులోనై జన్మరాహిత్యమగు పదవిఁ జెందిరి.

అత్తరి దక్షుండు నారదుని మూలమున తన మనస్సంకల్ప విఫలత గలిగెనని శోకించెను.

—( నారదునకు దక్షుండు శాపంబిచ్చుట. )—

గీ॥ మోము జేవురింప ముడివడ బొమదోయి । చూపు వెంటమం
డి నుసిగొనంగఁ । బెదవులదరఁ బండ్లు పెట పెట గొఱుకు
చు । దక్షుఁ డాగ్రహించి తపసితోడ ॥

చ॥ నెఱయఁగ సాధురూపమున నీవతి బాలుర నాత్మజాతికిం
గఱకున భిక్షుమార్గ మగుకంథవసెప్పితి వేలధూర్తవై । మఱ
వక యుండవచ్చునె కుమారమతీ దురితంబు నేఁడు । నిన్నొర
లఁగ ద్రోతు నాడు సముదగ్ర మహోగ్రమహాశాపవహ్నులన్ ॥

దేవఋణ పితృఋణంబులు దీర్పక కర్మవిచారంబు సేయని బాలుర మనంబునకు, ఐహికేచ్ఛలయందు, నిరాశగలుగఁజేసి, నివృత్తిమార్గం బుపదేశించి, వారలకు నుభయ లోకంబుల యందుఁ జెందగల శ్రేయోహాని నొనర్చితివి. ఇట్టి పాతకంబున భాగవతోత్తములలో లజ్జావిహీనుండవై యశోహానిం బొంది చరింపుదువు. నిరంతరము లోకసంచారివై నేలోకమునను, నునికిపట్టు లేకుందువు. గాక యని శాపం బిచ్చెను. "క్షమారూపం తపస్వినాం" అనువా

వాక్యానుసారముగ నారదుండు శాంతమున శాపము సంగీకరించెను. ఆ శాపవశమున త్రిలోక సంచారి యయ్యెను.

—(నారదుండు త్రిమూర్తులు బాలురగుటఁ బృందారకులకుఁ జెప్పుట.)—

శ్రీమన్నారాయణునికి యనసూయ వృత్తాంతము తెలిసివచ్చుచు తనలో తానిటులఁ దలపోసికొనెను. " అథపురుషో హ వై నారాయణో కామయత బ్రహ్మనారాయణః శివశ్చనారాయణః శక్రశ్చనారాయణః" తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః సబ్రహ్మ సశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్" అనుచొప్పున భేదభావము లేక ,, యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి విభావయేత్,, అను ప్రమాణమున సర్వంబ్రహ్మమయంబని దలంచి తపోనిష్ఠాగరిష్ఠుండనై శాంతత్వ సాధుత్వ నిర్దోషత్వ భ్రాంతత్వ జడత్వాది గుణములన్నియు "సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్యనామధేయాని" అను, వాక్యానుసారముగ బ్రహ్మకృత్యములని పరబ్రహ్మ గుణములే కాని వేఱొండుఁ గాదనిదలంచి ,, అహంబ్రహ్మాస్మీత్యాకారక ,, ప్రజ్ఞగలిగినవాఁడనై శ్లో॥ కాయేనవాచామనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్ । కరోమియద్యత్సకలంపరస్మై నారాయణాయేతిసమర్పయామి,, అనిభగవదర్పణ సేయుచుందు. భగవద్భక్తుడనుకావునసే అనసూయాసాధ్వి యిందిరారమణుని దర్శన మిప్పింపుమని కోరియున్నది. నేనిటుల వారికి విన్నవింపక సప్పతివ్రతామహాత్మ్యము గొనియాడితి. అందున వారద్భుతము నటించిరిగాని, జగధీశులకు నాయభిమతము తెలియకుండునా? "వెనుక చింతించుట వెఱ్ఱితనము." యనునటుల నిప్పుడాప్రస్తావన యనావశ్యము. అనసూయ కోరికదీరముగ్గురు బాలురకు చక్కఁగ పుత్రవ్యామోహాభక్తితో పూజింపుచున్నదిగద. ఇట్టిసంగతి లోకమున వెల్లడించి నాప్రతాపము ఋషిపత్నిపతివ్రతామహాత్మ్యము శాశ్వితముగ నిలుపునటుల జేసిన మహాఋషులకు నమస్కృతులొనర్చెదను.

వ ॥ బ్రహ్మణ్య దేవుఁడగు శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మసదాశివులు బాలక్రీడలు జూపుచుండు తావునకు దేవేంద్రుఁడు మొదలగు దేవతలు లక్ష్మీసరస్వతీ పార్వతులను ఋషులను జేర్చి నాఖ్యాతి బాగడ్త కెక్కించుకొనియెదను. మున్ముందు యింద్రపట్టణము జేరెదను. అనిక్రృతనిశ్చయుండై స్వర్ణరత్నమయంబులగు గోపురంబులు కల్పవృక్షంబు కామధేనువు చింతామణి చౌదంతి యుచ్చైశ్రవ హయము అమృతంబు నందనోద్యానంబు సుధర్మయనెడి సభ చంద్రకాంత పర్వతంబులు గలిగి సకల వస్తువులకు సర్వ సంపదలకు నివాసనిధానంబై గంధర్వ యక్ష రాక్షస కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విహాగ పన్నగ గుహ్యక చారణాదులును జ్యోతిష్టోమాది యాగంబులు గృహ భూ స్వర్ణ గోదానంబులు జేసిన పుణ్య పురుషులకు నివాసమై అర్చిష్మతి సంయమనీ పుణ్యవతీ అమరావతి గంధవతి అలకాపురీ ఐశాని నగరంబులకు నధిపతులగు అగ్ని యమ నైఋతి వరుణ కుబేర ఈశానులకు ప్రభువై పాకశాసనుచే పరిపాలింపఁబడు అమరావతి పురము జేరఁబోయెను. దేవేంద్రుఁడు యర్ఘ్యపాద్యాది విధుల పూజించి తగిన గద్దియనైనూర్చుండబెట్టి నారదసంయమీంద్రా వింతలేమైన గలవే యని ప్రశ్నింప బ్రహ్మమానస పుత్రుఁడిట్లు బలికెను. సురనాథా పరాకు లేక వినుము.

చ ॥ వరసుర యోగిపుంగవుల వాంఛలు దీర్చెడి యోగమూర్తులై । పరమ కృపాసముద్రు లగు పార్వతి నాథుఁడు శారదాపతి । హరియును బాలరూపములయన్ మహామునినింట చేసక్రీడలో । సురుచిరపూజలన్ గొనుచు శోభిలుచుండిరి పాకశాసనా ॥

చ ॥ సురపతి నారదువాక్యములు సూన్ఋతమంచు నెఱింగి మా

---

౭౨ పత్రమునందలి శృతి సవరణ.

" యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్ ,,

నులుఁ । సురగురుతోడుతఁ వెడలి చోద్యపుటాంబర చే
త నంబులఁ । బరువడి బాపవేడియు శుభంబగు పూర్వపు
దివ్య తేజముఁ । కరుణతో జూపగాంచగల కార్యము గ
గ్గెను పాకశాసనా ॥

ఈరీతి నుడివి సంతనే తత్తరంబున మహేంద్రుఁడు, సద్దియ దిగ్గనురికెను. తక్కుంగల దిక్పాలురు నాసభలోగల విశ్వామిత్ర భారద్వాజాది మహర్షులును యాతురంబున లేచినిలువంబడిరి అంతట విశ్వామిత్రుఁడు నారదునిచూచి నారదా! త్రిమూర్తుల పత్నులను దోడ్కొని చనినగాని మన ప్రయత్నము కొనసాగదు సుమా! దేవేంద్ర మహారాజా! శుభస్య శీఘ్రంబని మనము, లోకమాతలగు, లక్ష్మీ పార్వతీ శారదల కడకుఁబోయి వారల వెంటనిడుకొని బోదము లెమ్ము. అనెను తక్కుంగల వారలును విశ్వామిత్రుని నుడువులు కార్యసాధనముగా నొప్పునని. అనంతర మెల్లరు శీఘ్రగమనంబున కైలాసమునందు పార్వతిదేవి విహరించు, యుద్యానవనంబును శివుండు జలక్రీడలాడు చెంగల్వకొలఁకులును దేవకన్యలు విహరించు శృంగారంబగు కొలనులును సిద్ధులువసించు పూపొదలును బిల్వరుద్రాక్షవనంబులును నందికేశ్వర గణేశ్వర చండికేశ్వర ప్రముఖ ప్రమథగణేశ్వరులుండు తావులును గడచి రత్నమయమై భాసిల్లు సౌధముఁజొచ్చిరి.
మణిమయ సింహాసనాశీనయగు పార్వతిదేవిని గాంచిరి. బృందారకులెల్లరుఁ బ్రణమిల్లిరి. ఋషులు దేవీసూక్తములు పఠించిరి. నారదుఁడు ముకుళితహస్తుఁడై.

గీ॥ అంబశాంభుఁడువిష్ణుండు నజుడునత్రి । యాశ్రమమునందు ఋ
షిపత్నిహస్తమొంది । క్షీరపానంబు శైశవ క్రీడలొప్పి । వింతనటియిం
పుచుండిరి వేడుకలర ॥

అని నుడివెను. శార్వాణి యాతురతో నారదా! వారలాస్థితి గనుప

ట్టుటకు కారణభూతుఁడ వీవె గద! సభాసభ్యులారా! కర్తవ్యాంశ మెయ్యదియో ఊహింపుఁడు. అన విని దేవేంద్రుండు,

గీ॥ నీలగళవిష్ణుబ్రహ్మల నేర్పడేము। సకల కార్యంబులనువీడి సంతసమున । సత్రిభక్తికిమెచ్చియు సటవసించు । లోకములు తల్లడమునొందె లోకజనని ॥

ఉ॥ కావునసత్వరూపములు గాంచెదివేడ్కఁ జనించెనంచు । మీ భావములక్ష్మిదేవికిని భారతికిన్ దగవిన్నవించిమా । శీవరపాటుఁబాయుటకు తీవ్రముగాజనుదేరునట్లుయో । భావజునైరి రాణిరో నుపాయముసేయుము పూర్ణసత్కృపన్ ॥

అనవిని సురాధిపతి నీవానతిచ్చినట్టుల సర్వజ్ఞులగు త్రిమూర్తుల సందర్శనార్థము శీఘ్రమున బోయెదము గాక, నారదా! కలహకారకుండవై మాకు తహతహను కలిగించిన మహానుభావుండవు. కావున శీఘ్రగమనంబున సత్యలోకము వైకుంఠంబులకుఁజని లక్ష్మీ సరస్వతుల నిందుదోడితెమ్మా. "అలస్యమ మృతం విషం॥ బనునార్యోక్తిని మఱవకుము శుభస్య శీఘ్రం బనునది జ్ఞప్తియుండుగుంచుకొనుము. అని పార్వతిబలుకఁగనే నారదుడు మోగివమార్గ ప్రదర్శని నీయాజ్ఞను శిరసావహించెద నని సెలవందిసత్యపురమార్గమున వెడలి త్వరితగతిని బ్రహ్మపట్టణమును జేరెను. అందు విశ్వకర్తలగు మనుపులుభృగుపులస్త్యపులహక్రిత్వంగిరసాదుల్ విదత్తుండను

బ్రహ్మలును దేవగణంబులును, వసు, రుద్ర, సిద్ధ, సాధ్యులును ప్రజావంతులైన పంచాదశసహస్రమునులు, ఋగ్యజుస్సామాథర్వణ మూర్తివంతములను గాంచుచు చనిచని నవరత్న మండపములగు గృహంబులు, సౌధములు గడచి అతిమనోహరంబై, మందారకుంద పారిజాత సంతానకల్పక హరిచందనాది తరువులును, కీర శారి కామయూర పికప్రముఖపక్షిని కరంబులును, కమలకల్హార కుముదకైరవ వికసితంబులును హంస, కారండవ, జల, కుక్కుటాద్యాది శ్రేయం

బులున్నైన మధూపమాన జలములచే నొప్పియుండు వనంబున చం ద్రకాంతామణి శిలపై ఋషిపత్నులగు ఖ్యాతి, భూతి, సంభూతి, క్షమ, ప్రీతి, సన్మతి, వారలతోఁ గోష్ఠిసల్పుచుండు, సావిత్రి గాయిత్రి సరస్వతులగాంచి ప్రణమిల్లి యిట్లుల విన్నవించెను.

గీ॥ వినుము భారతిసీపతి విష్ణుశివులు । సృష్టియాదిగ కార్యముల్ సేయ నెరిగి । అత్రిచేపూజగొనుచు నయ్యాశ్రమమున । భక్తవాత్స ల్యతనుజూప బాలురైరి ॥

గీ॥ జ్ఞానదాయిని వాగ్వాణి గానలోల । శీఘ్రబుద్ధినివారల జేరర మ్మ । యనగ నాశ్చర్యమగ్నమై నాతురమున । నేమి సేయుదు నారదా యెరుగబలుకు ॥

అన హేశారదాంబా! పార్వతీదేవి ప్రమథగణముతో ప్రయాణమునకు సంసిద్ధమైయున్నది లక్ష్మిని, నిన్నును దోడితెమ్మని నాకాజ్ఞ యిడుటచే నేనరుదెంచితి,జాగుసేయవలదు అని నారదుడు ప్రత్యుత్తర మిచ్చెను. ఋషిపత్నులతోడ మేమును సంసిద్ధులమే! నరుగుదము రె మ్మ. అనుచు వైకుంఠ పురమార్గమున జనిరి, శీఘ్రగమనంబున వి కుంఠము జేరిరి పద్మరాగ, మహేంద్ర, నీల, మరకత, మాణిక్య, శంఖ, సేత, బాల, బహుబాల, రుచక, శమంతక, కౌస్తుభ, చంద్రకాంత, సూర్యకాంత, ప్రభాకర, సువర్ణ, చామర, చిత్రద్రవ్యంబుల చే తఁ బుణ్యక్షేత్రంబై పర్వనిర్వాణ సుఖప్రదంబై బహువిధమణి రచిత, మనోహర, కోటి చతుశ్శాలా, సమన్వితంబై, పద్మరాగ, మణి ఘటిత సోపాన. సమన్వితా, మహేంద్రనీల, స్తంభ, సహస్ర సంభృత, రాజిత, కలశోజ్వల, ప్రవాళ, కవాట, వజ్రప్రాకార పరివేష్టి తానే క, మందిర సుందరంబులను గాంచిరపుడు.

" చ॥ సముదిత వజ్రసారములు చారువినీల మణీకవాటము । ల్వి
మలపారి న్మణీరచిత, వేదికలుఁన్మణి కాంతరత్నకు । డ్యము
లు ప్రవాళ జాలములు । దంచితశీతల వారిపూర్ణఖే । యా

ములువిచిత్రకేతనచ, యంబులుగల్గి పురంబుభాసిలెన్ ॥
చ ॥ సురుచిరదివ్యరత్నపరి శోభితపుష్కర చుంబిసౌధము । ల్గు
గుతర వాజిశాలలును గుంజరశాలలుఁ జంద్రశాలలు । న్న
రసతిఁ జిత్రశాలలును స్యందన శాలలు యానశాలలు । న్ద
లుచుఁగ గల్గియప్పురము దద్దయునొప్పె మనోహరాకృతిన్ ॥
చ ॥ సలలితరత్ననిర్మిత వి శాలమనోహర చందనాగ రూ ।
జ్జ్వల స్మృగనాభిసిక్తవిల సన్నవమౌక్తిక పుష్పమాలికా ।
విలసితనూతనపత్రముక వేష్టితపల్లవ తోరణావళీ । కలితమ
హాపథంబులును గల్గిపురంబలరారె నెంతయున్ ॥
క ॥ క్రీడాగృహములు రమ్యక్రీడాశైలములు రత్న గృహములు
సు దివా । క్రీడాసద్మములు నిశా । క్రీడా వేశ్మములు నప్పు
రి నెలువొందెన్ ॥

సుపుష్పిత, మనోహర, సుగంధి, వాయుసురభీకృత, చారు చంపక, నాగరంగ, నారంగ, లవంగ, లుంగ, నాగ, పున్నాగ, పూగ, జంబీర, జంబూ, నింబ, కదంబ, ఖర్జూర, నారికేళ, ర సాల, పనస, దాడిమ, కదళీ, కేతకీ, మందార, మాలతీ, మా ధవీ, మల్లికాప్రముఖ, నిఖిల, తరులతా సంకుల, మహోద్యా నంబులు గలచి, మణిప్రాకార వితర్దికా శోభితంబును, మణిసారవి కార శృంగారాన్వవిచిత్రతల్ప సమన్విత, నానాజాతిప్రసూన వాయు సురభీకృత, రత్నప్రదీపసంయుక్త, సువర్ణ కలశోజ్జ్వల, నవకోటి మంటపోపేతంబులు, బుష్పోద్యాన సరోవర శోభితంబును, మధువ నమధ్యంబున, వటమూల సమీపంబున, నుండు పద్మసరోవరమున విహరించు పద్మాలయనుగాంచి ప్రణమిల్లి,

శ్లో ॥ పద్మప్రియే పద్మిని పద్మహస్తే ॥ పద్మాలయే పద్మదళా
యతాక్షీ ॥ విశ్వప్రియే విష్ణుమనోనుకూలే త్వంపాదపద్మం
మహిసన్నిధత్స్వ ॥

గీ॥ సింధుకన్యవీవు క్షితితలంబున మర్త్యలక్ష్మివీవు భోగిలక్ష్మి
వీవు। విష్ణుమాయవైన వైష్ణవీసతివీవు। సకలరూపవైన ప్రకృతివీవు॥

ఉ॥ బాగుగనెంచిచూడ మునివర్గనుతైప రమాత్మ్మచూచు సం।
యోగ వియోగము ల్దలప నొక్కటి నంటియు నంటకుండి
సం। భోగవిరాగివై నిఖిలభూత మయుండగు వాడు బాలు
డౌ। యోగమదేల దాల్చెనొకొ యొప్పుగగాంచుము లో
కపోషణీ॥

గీ॥ పరగఋషిపత్ని యనసూయభాగ్యరేఖవలన ముప్పూరుపుత్త్రు
లైవరలుచుండి। రింతకన్నను వేరెద్ది వింతగలదే గానవారల
గాంచెడి కాంక్షసేయు॥

హేమాతా! పార్వతీ మొదలగు వారలు, అత్రిమహాముని యాశ్రమమునకు బోవ సంసిద్ధులై యుండిరి. నన్నిటకంపిరి. మనకై నిరీక్షించు చుండగలరు. కావున. జాలముసేయక శీఘ్రముగవిచ్చే యుము. అనవిని నిమీలితలోచనయై వైకృత మనస్కురాలై లక్ష్మీదేవి ప్రయాణోన్ముఖు రాలయ్యెను. ఋషిపత్నులు, మహర్షులును వెంటనడువ వేగంబున కైలాసగిరియందు బ్రవేశించిరి.

అటనుండి లక్ష్మీ సరస్వతి పార్వతులు బ్రహ్మలు, ప్రమథగణము, ఋషిపత్నులు, దేవతలు, గంధర్వస్త్రీలు, తుంబురుడాదిగాగల భక్తులతో ఋక్షనామక కులాద్రి తటంబున నుండు అత్రియాశ్రమము జేరిరి వీరలా గమనంబున కుల్లసిల్లి, అత్తరి మృగవిహంగ సంతోష ధ్వనులచే పిక్కటిల్లెను.

తరు లతాదికములు నాకృతులు సువాసనలు మాధుర్యములు వెల్లడించు పుచు చూత, పనస, యాదిగాగల ఫలములక్రింద రాల్చుచు చనసమానములై సూర్యరస్మి సోకనీయని నీడలనొప్పి మల యానిలుని

సహాయము వచ్చినవారల నాహ్వానించుట కోయనశాఖలు వంగుచు వ్రాలుచు పాంథులగు వారలకు సువాసనాఘ్రాణశక్తి మారకుండుటకు విశ్రాంతిగా గనుపట్టు చలుపందిరిగ నల్లుకొని యుండెను.

సమీపమందు పారుచుండు వింధ్యానది జలసమృద్ధియై తేటతియ్యని నీటితో కల్మషరహితయై తనప్రతాపము నణంచికొని మెల్లమెల్లన ప్రవహించుచు నిర్మలముగ నుండెను.

దేవతలు మొదలగు వారెల్లరు సేదదీర నానదీజలంబుల స్నానమాచరించి నిత్యకృత్యంబుల దీర్చికొని పూజాద్రవ్య సంగ్రహులై రి, భేరీ, మృదంగ, కాహళాది వాద్యంబులు, మ్రోయించిరి.

అంతట యత్రియనుసూయ లేతెంచి, ఋష్యాదులకు వందన మాచరించి యాశ్రమమున జేర్చిరి వారలకుచితరీతి నాసనములు సమర్పించిరి.

పార్వతినిగాంచి తాపసోత్తములిట్లుస్తుతించిరి.

" మ॥ కీర్తిరూపిణి కీర్తిదాయని కీర్తికారణ రూపిణీ। కీర్తిమందిర కీర్తిమత్సరి కీర్తనీయగు ణోత్తరా। కీర్తిసాగర కీర్తిభూషిత కీర్తికీర్తి ఫలప్రదా। కీర్తినిర్జిత తారయత్రిత ఖేదజాల విభంజనీ॥

లక్ష్మీదేవిని జూచి.

" గీ॥ దహనునందుమిగుల దాహికాశక్తివై। సోమునందుఁబూర్ణ శోభవగుచు। మోక్ష కాముకులకు ముక్తిప్రదాత్రివై। వ అలునీకొనర్తువందనములు॥

" శ్లో॥ వందేసర్వసురాది భిర్నిగదితాం లోకప్రసిద్ధాం ప్రభాం॥ శుభ్రాంశాస్త్రపురాణ నాటక మహాకావ్యాదిసం చారిణీమ్। బ్రహ్మాదిత్రిదశైరవందితగుణై రావేష్టితాంసర్వదా। నానాభూషణ భూషితాం నతజనాభీష్ట ప్రదాం భారతీమ్।

అని సవినయముగ భక్తిపూర్వక ప్రణామంబు లాచరించిరి.

అనంతరము దేవర్షులు బ్రహ్మర్షులు సప్తబ్రహ్మలు దేవతలు లక్ష్మి సరస్వతీ పార్వతులు బాలురుగ గనుపట్టు త్రిమూర్తులకు, విధ్యుక్తముగ, ఋగ్యజు సామవేద మంత్రంబులచే పూజగావించిరి.

రత్నదీపంబుల నివాళులిడిరి. సురలు పుష్పవర్షము గురిపించిరి. మహర్షులు వేదమంత్రంబుల నభిషేకముగావించి స్తుతించిరి.

దేవేంద్రుండు ముకుళిత హస్తుండై శ్రీమన్నారాయణా ప్రణవస్వరూపుండవు, ప్రణతార్తి భంజనుండవు, పద్మనాభుండవు, పద్మినీనాయకుండవు, మిహిర హిమకరలోచనుండవు, సర్వజగదాధారుండవు, వేదవేదాంత వేద్యుండవు, ధ్యానాగమ్య విగ్రహుండవు, యోగి ధ్యేయుండవు, పరమకళ్యాణ గుణరత్నాకరుండవు, వాసుదేవుండవు నగునీవు, మాయామానుష బాలకుండ వగుటచే లోకంబులు తల్లడము నొందుచున్నవి.

కావున శీఘ్రము మన నీస్వస్థానమగు వైకుంఠము జేరుము.

(లక్ష్మీదేవి) కరకమలంబులు మోడ్చి, హే పరమేశ్వరా! పరమపావనా! పరమకల్యాణ గుణాభరణా! పాపహరణా! భక్తవత్సలా! పంకజనాభా! పుండరీకనయనా! భుజగేంద్రశయనా! కరుణాకరా, సుందరాకారా, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా, ఆదిమధ్యాంతరహితా! అప్రమేయా, ఆనందరూపా, మునిజనవందితా, నీలమేఘశ్యామా అనంతగరుడవిష్వక్సేనాదులు,, బృందారకులు, నినుగాంచు కాంక్షచే సేవించిరి.

ఆర్తత్రాణ పరాయణతను నిలుపక బాలక్రీడలు జూపుచుండుట ఎంతకాల మోర్చియుందురు, ఎంతనివిన్నవింతురు, ఎటులోర్తురు, నీమాయలు లీలలు గనుగొని, సంతసించిరి గాన,

మ॥ ఒంటినిల్చి పురాణయోగులు యోగమార్గనిరూఢులై।
కంటిముందుగ గానినిక్కము గానరీ భవబాహ్యులన్।

గంటిభద్రముఁ గంటిమాంసపుఁ గన్నులం గనఁబోలదీ ।
దొంటిరూపుఁదొలంగ బెట్టుము తోయజేక్షణ్ర మెుక్కెదన్॥

(పార్వతి) పరమేశ్వరా! పురహరా! స్మరహరా! పరమదయాక రా: గజచర్మాంబరా! గంగాధరా! సర్వేశ్వరా! పాపవిదూరా! పరమకల్యాణ గుణాకరా! భక్తవత్సలా! దయామయా! ధర్మనిలయా! ప్రణతార్తినాశనా! భవబంధవిమోచనా! పన్నగాభరణా! చంద్రచూడావతంసా! కైలాసనిలయా! కాలాంతకా! పశుపతీ! శంకరా! నీవు పరమ సౌలభ్యశీలుడవు జగద్భయంకర హాలాహల భక్షణుడవు కాలపాశభీతి నివారకుడవు సర్వకామప్రదుడవు ముల్లోకముల నెల్లెడల నిరాటంకముగాఁ దిరుగుచున్న పురత్రయమును మందహాస మాత్రమున నొక్క నిమిషములో భస్మముచేసి లోకముల నుద్ధరించిన మహామహుడవు ఉత్తుంగమగు గంగను జటాజూటమున ధరించిన మహనీయుడవు చరాచరము నంతటను వ్యాపించి యుండువాడవు సకలలోకములకు సంతత శుభములు గలుగఁజేయు వాడవగుటం జేసి వేదములు నిన్ను శంకరుఁడని సదా వినుతింపుచున్నవి.

సర్వాంతర్యామివై సర్వసాక్షివై వెలయుచున్న నీవు బాలుడవైయుండుట భక్తవత్సలతచేత నని భావించితిమి.

నీవిట బాలక్రీడలు జూపుటచే నిన్నెడబాసి యుండుట నాకెంతయు వింతగ దోచు చున్నయది. నాపరితాపమింతింతనరాకున్నది. మరాళము కమలవనమునుచాతకమునవపయోధరమును, చకోరము చాన్ద్రిమును, అంధకారమున నున్నవాడు దీపమును, తత్వవేత్తలునీతేజమునుగాక్షించు నటుల, దేవతలు బ్రహ్మలు మహర్షులు మొదలగు వారు నీస్వస్వరూపము గాంచువాంఛచే నిటకరుదెంచిరి. గాన, సకలధర్మార్థసిద్ధిప్రదాతవు - త్రిగుణప్రధానమై - హరిహర బ్రహ్మాభిధానమై - జగద్భరణ హరణ కరణములకు యుపాదానకారణమై- శృతులయందు ముఖ్యముగా ప్రతిపాదింపఁబడెడి, నీయీశ్వరత్వము నిలుపఁ

నీదివ్యమంగళ విగ్రహమును దర్శింపఁజేయుము. సంపూర్ణానుగ్రహమున, మాకోరిక సత్వరమున నెరవేర్చుము. ఇంతకన్న మేముకోరునది మఱొకటిలేదు.

సీ॥ యోగీశ్వరేశ్వర ! యోగిహృద్భాసుర
యోగగుణాకర ! యోగవిదుర!
సర్వలోకాధార ! శాంతదయాకర
దక్షయజ్ఞ ధ్వంస ! ధర్మవిపళ !
సర్వాత్మ సర్వేశ ! సర్వకర్మనివేశ!
సాధుసజ్జన పోష ! చారుభాష!
పన్నగ భూషణ ! పరమసంతోషణా!
భక్తార్తి భంజన ! పాపహరణ!
గీ॥ కాలపాశ నివారణ ! కాల కంఠ!
నిగమగోచర సర్వజ్ఞ ! నిగమ వినుత!
భసిత రుద్రాక్ష ధారణ ! పశుపతీశ!
పరమ కరుణాంతరంగ నా ! ప్రాణనాథ !!!

అనంతరము, ( సరస్వతీ దేవి )

హే! మహానుభావ! పరమేష్ఠీ! బ్రహ్మనిష్ఠాగరిష్ఠులకగోచరుఁడవు. అణిమాద్యష్టసిద్ధులు యోగులు తాపసులు బ్రహ్మవేత్తలు నీ పదంబుగోరిన వారలకు, శాశ్వతానందము గలిగించువాఁడవు. వేదమయుఁడవు. వేద వేదాంతమునకు మూలమవు. సర్వకారణ భర్తవు. సర్వసృష్టికర్తలకధిదేవుఁడవు. సత్యలోకనివాసుఁడవు. సచ్చిదానంద రూపుఁడవు. సృష్టిజేయుచు సమస్తలోకముల నుల్లసింపఁ జేయువాఁడవగునీవిటుల ఋష్యాశ్రమమున బాలుఁడవైయుండుట ధర్మవిరుద్ధము. లోక క్షోభముకదా? ఇంత వరకు చూపిన లీలచాలును. శీఘ్రముగ మానేత్రానందముగ, నీస్వస్వరూపముఁ బొడగనజేసి, సత్యలోకమునకు విచ్చేయుము.

ఉ॥ నీనవిలాస వైఖరులు । నిక్కపుజూపితి వింకచాలుతే
నీదరి జేరి దేవతలు । నిర్మల భక్తిగొ వేడుచుండగా
మోదము నొందనెంచకను । మున్నునెరుంగని బాలరూపివై
ఖేదము గల్లజేయుటకు । కీర్తికిభంగము రమ్మొ సృష్టికై ॥

అనంతరము నారదుడు హే సృష్టి స్థితిల యాధికారులారా!

శ్లో॥ బ్రహ్మాత్వే సృజతేసర్వం స్థితౌపాల యతేపునః । రుద్రరూ
పాయ కల్పాంతే । నమస్తుభ్యం త్రిమూర్తయే ॥

దేవరవారి పాదపద్మములకు బ్రణమిల్లు చున్నవాడను.
మీరాకు త్రిగుణాతీతులు, అవాఙ్మానస గోచరులయ్యుండి భక్తిపరవశ
తచే బాలక్రీడలు జూపుటకంటె వింతగా గన్పడు లీలలేమియు లేవు.

కపటనాటక సూత్రధారులనుట తథ్యంబయ్యె! అనసూయా
పాతివ్రత్యమునకు మెచ్చియో అత్రిమహాముని తపోమహిమ కానం
దించియో నాచాతుర్యము గనుగొనలేకయో "భక్తానాంత్వం ప్ర
కాశిని" అనునది యదార్థముచే యదలంచియో? తడవుసేయక దా
సార్తిహారకులగు మువ్వురేక శ్రీనముగా నిచ్చుటకి విచ్చేసితిరి.

మీకరుణా కటాక్షమున నాభక్తి సామ్రాజ్యము లోప్పునటు
ల గావించితిరి.

నాభక్తినే గెలుపొందజేసితిరి.
ముల్లోకవాసులచే నేను వందనీయుడగుటకు కారణభూతులైతిరి.

గీ॥ భక్తిభావంబుగలుగునా ప్రజ్ఞవెలయ । జేసియుండినబ్రహ్మలు
శిశువులాట । వేడబంబునుగాని వివేకశూన్య । మాటగాదని
నెఱుగునా మానసంబు ॥

సర్వకాలము సేవించని యీ బాలబ్రహ్మ తేజముగాంచుట, సంత
సించుట, భక్తిప్రభావమే యనునది యెల్లరకు తెలియునటుల నెల్ల
డించితిరి. "నహంవసామి వైకుంఠే । నయోగిహృదయే రవౌ । మ
ద్భక్తా యత్రగాయంతి । తత్రతిష్ఠామి నారదః ॥" అని నాకు యితః

పూర్ణము బోధించినది. సాదృశ్యము జేసితిరి. జాగుసేయక లక్ష్మి సరస్వతి పార్వతీమొదలగువారలు కాచియుండిరి. వారివాంఛిత మి డేర, స్వస్వరూపముల స్వస్థానముల జేరుట కర్తవ్యము. ఈ మా కోరిక సఫలీకృతము గాదేని, లోకముల్లో కల్లోలము లొందకలవు. గావున పరమపతివ్రతా సాధ్వియగు, యనసూయ మనోరథ సఫ లత శాశ్వతమై యుండునటులఁ గావించి శీఘ్రమున మీరాకై సిరీక్షిం చియుందు, మాకొఱతల దీర్పుడు. అని ప్రార్థించినంత, త్రిమూర్తు లు దివ్యమంగళ విగ్రహముల, నెల్లఱకు దరిశనం బొసంగిరి.

అనంతరము విష్ణువు యోజననటించు బ్రహ్మ శంకరులతో ర హస్యాలోచనజేసి, చిరకాలమునుండి తాపసుడు గోరుటయేగాక, అ నసూయకు బాలుంరైతిమి కావున యీరీతి నిలుపుటయే లెస్సయ న వారిదుపుడును సమ్మతించిరి.

పిదప శ్రీమహావిష్ణువు అత్రి యనసూయను ప్రపంచ వ్యవ హారమునందాసక్తి జనింపజేసెను. తాపసుండు దేవేంద్రుండు మొదల గుసురలను తమకు యజ్ఞము సేయదలపు జనించె కావున, హోమ గుండముకడ కఱుదెంచవలసినదని ప్రార్థించెను. అటగల వారలేగాక తక్కుంగల వారలనుకూడా రావించిరి. ఓయీ త్రిశంకమహారాజా నేను నాభార్య సహితుడనై, యాహ్వానింపఁబడి చేగియుంటిని.

ముల్లోకవాసులు నత్రపసి యాశ్రమమును జేరినపిదప త్రిమూ ర్తులు, అనసూయ, అత్రి, మిథునములచే యాగముగావింప జేసిరి.

హోమాగ్నినుండి యాగమునకు పూర్వము గనపడినముగ్గు రుబాలుర వెలువడ జేసిరి. అబ్బాలుర నెత్తుకొనిఅనసూయపరమా నంద భరితాయెను. పుష్పవర్షముగురిసెను. దేవదుందుభులుమ్రోగెను. అచ్చరలగానన్రృత్తాదికములానందము గలిగించెను. మునులు ఋషులు వేదముల స్తుతించిరి. మందస్మితవదనారవిందులగు త్రిమూర్తుల గాంచి అత్రిమహాముని ముకుళితహస్తుఁడై,

శ్లో॥ విశ్వోద్భవ స్థితి లయేషు విభజ్యమానై, ర్మాయాగుణై రనుయు
గమ్ విగృహీతదేహాః । తే బ్రహ్మ విష్ణు గిరిశాః ప్రణతోఽస్మ్యహమ్
వస్తేభ్యః కఏవ భగవాన్మయి హూయాపహూతః । ఏకో మయేవభ
గవాన్ విబుధప్రధానై శ్చిత్తీకృత ప్రజననాయ కథన్ను యాయామ్
అత్రాగతా స్తనుభృతామ్ మనసోపి దూరా । బ్రూత ప్రసీదతమ
హా నిహ విస్మయో మే ॥ భా ॥ చ ॥

ప్రపంచము యొక్క సృష్టి స్థితి సంహారములందు యేర్పరుప బడిన, ప్రకృతి గుణములచే యుగయుగమున బ్రహ్మ విష్ణు శివ రూపములను బరిగ్రహించు మీకు వందనము లొనర్చెదను. పుత్రార్థినగు నాచే పిలప బడిన వారెవరు? మీరు మువ్వురొచ్చుటచే నాకాశ్చర్యమగుచున్నది. అనెను. అమందకందళిత వదనారవిందులై, శ్రీ మహావిష్ణువు ఓయీ తాపసోత్తమా వినుము.

కం॥ విను మేము మువ్వురయ్యును । ననుపమ మతిఁ దలఁపఁ నేకమై
యుందుము నీ । మనమందు నేమికోరితి? । వనయము నాగోర్కె
సఫలమయ్యెడు జుమ్మీ ॥

కం॥ మాముువ్వురయంశంబుల । ధీమతులగు సుతులుబుట్టి త్రిభువ
నములలో । నీమంగళగుణకీర్తి శ్రీ మహితము సేయఁగలరు
సిద్ధముసుమ్మీ ॥ భా ॥ చ ॥

అని ప్రత్యుత్తర మొసంగి విష్ణుకళను భాసిల్లు నీబాలుని నీకుదత్తము జేసితిమి. బ్రహ్మాంశుండగు నమృతాంశుఁడు, పురాంతకు కళాంశుఁడగు దూర్వాసుండు, వీరిరువురు నీయొద్దనుండ జాలరు. వీరలలో శైవపురాణ ప్రకటీకృతమునకు, దూర్వాసుఁడును లోకములయందు రాత్రికాల ప్రకాశమునకు, సమస్తజీవకోటి కాధారభూతములగు, ఓషధులు, నాహారపదార్థముల వృద్ధికి చంద్రుండును, నియోగింపఁబడుదురు. మదీయాంశుండగు, దత్తుని నీకు దానమొసగితిమి. గాన నీపేరు శాశ్వతమై, యోగాధిపతియై, దత్తాత్రేయుఁడను నామంబున బరగుచుం

డు నని ప్రాక్కుచ్చెను. బ్రహ్మలు, బ్రహ్మర్షులు, దేవర్షులు మొదలగు వారలు తథాస్తు. శ్రీమన్నారాయణుని వాక్యములు సత్యమాగాకయని నొక్కుమ్మడి వక్కాణించిరి. పిదప నారాయణునకు సాష్టాంగ మొఱఁగి లేచి అత్రిమహాముని యిట్టుల ప్రార్థించెను,

సీ॥ సకలంబునీవయై సత్యస్వరూపివై సగుణనిర్గుణములసాక్షివ
గుచు। తుదిమొదలును లేక సదియుదియనరాని పరమాత్ముయు
ను బేరబరగుచుండి। పంచమహాభూత పంచతన్మాత్రల పం
చేంద్రియములచేపట్టుబడక। సర్వకారణములసర్వకారణమ
వై ప్రకృతికిసమీర ప్రబలియుండి। ప్రత్యగాత్మస్వరూపవ
గుచును యపరోక్షజ్ఞానమునను। సంపూర్ణతత్వమై షడ్భా
వరహితమై నిరుపమానందమై నిత్యమగుచు॥

గీ॥ సత్యమును బాసి యుండనిచందమునను। నిన్ను నీవని ప్రకృ
తిని నేర్పమీర। బరగు సృష్టిస్థితిలయప్రవర్తనముల। శ
క్తియుక్తుండ సర్వజ్ఞ శరణు శరణు॥

గీ॥ కాలచక్రముచేతను కాలుఁడనఁగ। కాలశక్తులకాలావధున
యవయవ। కాలనాభుఁడవౌచును గానజేయు। కాలకార
ణసాక్షినిగా భజింతు॥

అనంతరమనుసూయాదేవి దూర్వాస చంద్రులను పార్వతీ, శారదా దేవులకిచ్చి, దత్తుని చేత నిడికొని విష్ణువునదిక్కు మొగంబై

సీ॥ శాస్త్రచయంబుల జన్మకారణుడవై। సాధనాంతరమవై సా
క్షివగుచు। మాయకులోనయ్యు మాయను గెలిచియు। జని
తో బంధంబు బూనుకొనక। సర్వసమత్వమై సచ్చిదానంద
మై। సర్వజ్ఞమూర్తివై సార్థకముగ। సుజ్ఞానతేజమై శుద్ధమై
బుద్ధమయి సూక్ష్మస్వరూపమై స్థూలముగను॥

గీ॥ నిర్వికల్పసమాధిని నిగుడజేయు। నిత్యనిర్మలనిర్గుణ నిర్వికార।
నిరుపమానంద దాయక నిష్కళంక। శుద్ధపరిపూర్ణ విజ్ఞాన

సుందరేశ ॥

క ॥ పరమాత్మ నీకు పావన । చరణసరోజముల పూజసలుపగనాకీ । చిరుతను నొసంగినసిదగు । కరుణనుశాశ్వత ఫలంబు గంటి సుహాత్మా ॥

అనునంత, మందస్మిత వదనార విందుండగు శ్రీమన్నారాయణుండు ఓయీ ఋషిపత్నీ! నీతపోమహిమకు, పాతివ్రత్య మహిమకు సంతసించితిమి. నీవాంఛ నీడేర్చితిమి నాకరాంశుండగు నీబాలరూపు నివలన సర్వశ్రేయములు గాంచుకువు. మేము స్వస్థానములకు నరిగెదము. అన యనసూయ స్వామీమాయాశ్రమమును పావనము జేసి పూజలగొంటిరి. వింకలారగించవసి కొలతను దీర్చుకుంటిరి. అదియును సంపూర్ణతగావించుట వ్రాప్తన అనెను. అత్రిమహాముని కామధేనువు నాహ్వానము జేసి సకల పదార్థములు నాయత్తపఱచి నటగలవారలకు మృష్టాన్నంబున సంతుష్టిగావించి వందనములాచరించెను. అంతట త్రిమూర్తులు మొదలగు వారలు, విమానారూఢులైతమతమ స్థానములకు జనిరి. తదనంతరము యనసూయ దత్తాత్రేయుని చూచుచువ్వా శిరంబు మూర్కొని చుబుకంబు ముద్దాడి. చిన్నియనా! నాతపఃఫలమా !

గీ ॥ సర్వభూతమయుండగు సత్వరూపు । డైనపరమాత్మ సేవించి హర్షమొంద । వందనంబులనర్పించి వాంఛదీర । నిర్మలానంద భక్తిచేసిన్నుగంటి ॥

అని ముద్దు లాడుచు స్నానము జేయించి, యుయ్యాలలోఁ బరుండబెట్టి.

క । జోజో విష్ణుకళాంశజ। జోజో వరయోగి వంద్యజోసుకుమారా। జోజో యోగ విభూషణ। జోజో శ్రీదత్తమూర్తి జోజోధీరా॥

మ ॥ మూడు మూర్తులకాది కారణ భూతుండైన పరమాత్మవై । నేడునాగృహ పావనంబుగ నీవుదత్తుడవైతివా । యూడిగం

బులు పూజ లెల్లను యోగభూషణ గొంచుమా। రాడకన్
వసియించిమమ్ముల రక్షణంబును సేయుమా ॥

అని యిటుల ప్రార్థించెను. ఆయాశ్రమమునందే పూజలగొను చు దినదిన ప్రవర్ధమానుండగుచు పంచాబ్దంబుల వాడగుటచే గిరినాథ స్వామి వారిని రావించి వారిచే విద్యాభ్యాసము జేయించిరి.

ఆస్వామివారి వలన శీఘ్రకాలమున సర్వశాస్త్రార్థ యుక్తమగు మహావాక్యములు మొదలగు విద్యలం దధిక పాండిత్యముగల వాడ య్యెను. సర్వవిద్యా పారంగత్వము శీఘ్రము లభించినందులకు అత్రి యనుసూయ లమితసంతుష్టాంత రంగులైరి.

గిరినాథస్వామి యొకనాడు బాలకుండును తనకు శిష్యుండనిద లంపక దత్తాత్రేయుల గాంచి యోదత్తమూర్తి! సర్వవ్యాపకుడవు సర్వలోకా రాధ్యుడవు సర్వభూతాంత రాత్మవు నైయుండి నిమిత్త మాత్రమున ననుగురువుగా గైకొని విద్యలభ్యసించితివి.

ఇది నాయెడగల కృపయేగాని వేరొండుగాదు.

నేధన్యత జెందితిని. నీకృపా కటాక్షమును వెల్లడించువాంఛ నాకుజ నించినది. నీవుసర్వ సమర్థుండవు. కావున "నగురోరధికం,, బను నా ణ్యోక్తిని నిలిపి ననుతరింపఁ జేయుము. నాకాజ్ఞ నిచ్చిన పోయివచ్చెద ను. అన దత్తాత్రేయులు గురువర్యా! "గురుంప్రకాశ యేద్ధీమాన్,, అనునది శాశ్వత ప్రకాశమానము గలుగునటుల నొనర్చి గురు ఋణముఁ దీర్చికొనియెదనన సంతోషించెను తాపసులచే సెలవంది స్వస్థానమునకుఁ జేరఁబోయెను. అనంతరము దత్తాత్రేయులవారు దత్తా త్రేయగీత దత్తాత్రేయ పటలములు రాజయోగా నందమంజరి మొద లగు గ్రంథముల రచించి సప్తకోటి మహామంత్రములు అష్టాంగయో గములు యెనుబదినాలుగు ఆసనములు కల్పించి మంత్ర హాట లయ రాజయోగముల ధర్మములు ప్రకాశించునటుల ఋషులకు మునులకు బో ధింపు చు యోగపతియను పేరుగాంచి సుఖోపవిష్టులై యుండెను.

గాన నోచక్రవర్తీ.

క॥ జనవర దత్తాత్రేయుల । కునుపూజలు సలిపినంత కోరికలొద
వ్రన్ । ఘనమగు తాపము బాయును । మనమున దలపో
సి సేయు మాయజ్ఞంబున్ ॥

క॥ యోగవిభూషితుడగు యా । యోగికి విద్యుక్తముగనుయో
ష్ణగు భక్తిన్ । యాగము జేసిన నిహపర । భోగములునుగ
లుగ జేయు పుణ్యుల కెలమిన్ ॥

క॥ కావున వారలనిటకును । రావించియుపూజసలుప రయము
నసీకున్ । భావిత శుభసూచకముగ । ధీవరుడగు పుత్రు
నిచ్చి దీనత బాపున్ ॥

వ॥ పుత్రార్థినై అత్రియనుసూయలతోఁగూడ దత్తాత్రేయుల ను శీఘ్రమున రావింపుము. వారు విచ్చేయునంతలో బీదలకు, కుం టి గ్రుడ్డి వాండ్రకు, అన్న, వస్త్ర, ధన, గో, భూదానంబులు సే యుచు, గృహస్థబ్రహ్మచర్యవ్రతముని మంత్రి సామంత దండనాథు ల వందిమాగధాదులను విద్వద్బృందసహితముగ సరయూనదీతీరం బున నివసింపుము. నాలుగామడ నిడివియు, నంతియె వెడల్పునుగల, యాగశాల, నాలుగు ప్రాకారములు, పదియారు గోపురములు, వి శాలమగు వీధులు, నిరు ప్రక్కల ధన వివిధ వస్త్రంబులచే నిండిన కొట్టములు, సకలజాతులకు వేర్వేరుగ నన్నసత్రములకనువగు వం టసాలలు, చలువ చప్పరములు, చలువ పందిరులు, ఇమ్మగు గృ హములు, గజ, హయ, వృషభ, గోశాలలు, విచిత్రిత రంగంబు లుగ నుండునట్టుల నిర్మింపఁజేయుము. వలయు వస్తు సంభారములు త క్కువలేక దెప్పించుము. నానాదేశపురాజుల, ముఖ్యబంధువుల, దే వర్షి, రాజర్షి, బ్రహ్మర్షి, గణంబుల బిలువఁబంపుము. ఋ షులకై నాశిష్యులఁ బంపించెదను. గాయకులను, పండితులను, సు కవులను, విద్వాంసులను, మంగళవాయిద్యగాండ్రను, గణికారత్న

ములను, మొదలగు వారలఁ రావించి, వారలకుఁ దగురీతి సత్కరిం
చి, నియమితకార్యములందప్రమత్తులై యుండునటుల దిట్టపఱచుచు,
బీదసాదలను, భాగవతాళిని, దైవస్వరూపులుగ భావించి రాజుల
తోఁబాటు సగౌరవముగ భోజన భాజనంబులఁ బరితృప్తులఁ గావింపు
ము. హరిగుణానుభవము సేయు వారలను సగౌరవమున బిలిపింపు
ము. ఎవరేదానములు గోరిన వారల కాయారీతి దానములిచ్చి తృ
ప్తినొందించుము. అనవిని, సంతోషాంతరంగుండై గురువానతి శీఘ్ర
మున సర్వము నాయత్తపఱచునటుల మంత్రులకు నాజ్ఞాపించె
ను. వారలతి శీఘ్రమున నటుల గావించిరి.

—( త్రిశంకుఁడు దత్తాత్రేయులకై యాగము సలుపుట. )—



వసిష్ఠుఁడు దన శిష్యులబంపి వాల్మీక కణ్వ నారద పర్వత క
శ్యపాది మునివర్గమును బిలపించెను. చక్రవర్తి వారలను దగు రీతిఁ
దోడ్తెచ్చి, రత్నపీఠంబుల నమర్చి పూజించి కుశలంబడగి నేనుపుత్రా
ర్థినై సేయఁదలచిన క్రతువు దమబోంట్ల వలన సాంగము గావలయు
ను. గాన, యనుగ్రహించి యవభృథము వఱకిచ్చటనే నివసింపుఁడని
ప్రార్థించెను. ఋషులంగీకరించ, సంతసించె. పిదప విశ్వామిత్రుఁడే
తెంచ నెదురేగి దోడ్తెచ్చి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి
పూజించి దగిన సింహాసన మందధిష్ఠించిన పిదప, స్వామీ !! నేపు
త్రార్థినై యాగము సేయఁ సమకట్టితి. నన, మందస్మితవదనారవిందు
డయ్యెను. నానాదేశములనుండి విచ్చేసిన రాజులును జనకుఁడు మొ
దలగు వారలును సగౌరవముగ దోడ్తెచ్చెను. మహారాజసామ్రాజ్య
సింహాసనాధీశ్వరుఁడైన త్రిశంకు మంత్రిచే నాహ్వానింపఁ బడి విచ్చే
సిన యత్రి యనసూయ దత్తాత్రేయుల భేరీకాహళభాంకృత మృదం
గాదివాద్య విశేషములతో నెదుర్కొని పాదంబుల గడిగి దడిమొత్తి

జలంబులిరువురు జల్లుకొనియుత్తమపీఠంబుల వారిముఖ్వ్యరం గూర్చుం డంబెట్టి ముకుళిత హస్తుండై, అత్రిమహర్షీంద్రా! బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లగుటచే మీరలు బ్రహ్మవిష్ణు మహేశ్వరుల కొలువరగ గని సంత సించుటయేగాక విష్ణ్వంశచే యావిర్భవించిన యీపరమ యోగిని స దా సేవించు భాగ్య మబ్బినది. నాకును యిట్టి కోరికగలిగినది. ఈ యోగివంద్యునిచే నావాంఛిత మీడేరునని, మాగురువానతియందు నాకు దృఢనమ్మకము గలిగియిమ్మహ్మ రావించితి. యాగ సన్నాహములు సర్వము నాయత్త బఱుపబడినవి. యాగాధి పతిగా నితాముగాని య ధ్వర్యము వహించ బ్రార్థించెద. నన, దత్తుడు ముసి ముసి నగవు నగి యెను. అత్రిమహర్షి! రాజేంద్ర! నీ మనోరథము యాగానంతరము దప్పకీడేర గలదు. వసిష్ఠుగారి యనుమతివెంట యాత్మయజ్ఞము గా వింపు మనెను. అందులకు బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి బృందము లంగీకార సూచన నగపఱచిరి.

అత్రి అధ్వర్యుడుగను, తాను బ్రహ్మగను, కణ్వ, దేవల, కశ్యప, జాతుకర్ణ, జాబాలి, ద్వితచ, ఏకద్వితులు, ఋత్విక్కు లుగను, రాజర్షులుపహోతలుగ, నుండ వశిష్ఠుండెఱింగించెను. ఎల్ల రుసమ్మతించి, ఋగ్యజుస్సామంబులంగల స్వాహాకార, వషట్కా రంబులనలనం, అగ్నిష్టోమ, అతిరాత్ర ఆప్తోర్యామ, గారుడ, చయనాదులయందలి మంత్రములచే నాహుతు లాజ్యముచేవేల్చి మంత్ర తంత్ర లోపము లేకుండ, యాగము సంపూర్తి గావించిరి.

అవభృథ స్నానము గావింపజేసిరి. అత్తరి దేవదుందుభులు మొరసెను. గంధర్వులాడిపాడి, పుష్పవర్షము గురిపించిరి. తక్కుంగల ఋషులు ద్విజులు వేదమంత్రంబులుచదివిరి. దత్తాత్రేయులకు, పుష్ప హారములు, పునుగుజవ్వాజి, అత్తరు, పన్నీరు, మొదలగుపరిమళ ద్రవ్యములు. రత్నభూషణములు, వింజామరలు, పట్టుగొడుగులు, దు కూలములు సమర్పించిరి. కర్పూరనీరాజనములిచ్చిరి. వందిమాగధు

లకైవారము-గాయక-గణికల-హరిదాసులకీర్తనలధ్వని మిన్నుముట్టె ను. రత్నహారాలంకృతంబులైన. కరులు హయలు గోవృషభములు ముత్యములు, పగడములు, రత్నములు, కనక రజతముల దక్షిణతాంబూలములు. తెచ్చి యోగపతిని గ్రహించుమని చక్రవర్తి ప్రార్థించెను. దత్తాత్రేయుండు సంతసమున నో రాజా నీయౌదార్యమును మా, యెడజూపుట, యుచితముకాదు, యోగులకివియేల! ఇవియన్నియు విద్వద్బృందమునకు, బీదలకు దానముసేయుము నీభక్తికి మేము మెచ్చితిమి నీవాంఛాఫలం బీడేరునటుల. నొకసుపుత్రుండుదయించగలడు అనిఫలమంత్రాక్షతలొసంగెను. సకలఋషులుతథాస్తు. తథాస్తని యాశీర్వదించిరి. అనంతరము యోగమూర్తికి దత్తముజేసియుండువారి పదిరెట్లు యెక్కువగజెప్పించి. ఋషులకు బ్రాహ్మణులకు బీదలకు సదక్షిణతాంబూల ఫలములతోడ దానముజేసెను. కొందరికి జనస్యసమృద్ధిగల గ్రామములు, అగ్రహారములునిచ్చెను. ఎవరెవరేరీతి గోరిన నాయాదానములును. కన్యాదానాదికములును బహుళముగనిచ్చి. బ్రాహ్మణులను, బీదలను, సంతోషపరచెను. ఋత్విక్కులకు సంపూర్ణదక్షిణలొసంగి, ఆశీర్వాదముగొనెను. అనంతరము, బ్రహ్మక్షత్రియ, వైశ్యశూద్ర, జనంబులకు. దగురీతి మృష్టాన్నంబులం బరితృప్తులంజేసెను. ఎల్లరకు, స్వర్ణరజితములచే, నమర్చంబడియుండు అరటి యాకులలో భోజనం బిడుటచే నాశ్చర్యమునుంబొంది రాజునుతులు విధములంబొగడిరి తాంబూలచర్వణముసేయు సమయమున గాయకులుపాడిరి. గణికలు నృత్యగానంబుల తమతమనేర్పుదీపింప భరతమునుజూపిరి. సుకవులుచక్కని పద్యంబులు హృద్యంబుగంజదివి. అర్థంబులు సార్థకంబుగంజెప్పిరి. తమపరిచారకులతో సహానెల్లరకుందగు బహుమానములిచ్చెను. అయ్యందరు నయ్యంబుమీర, తమందమనెళ్ళప్పులకుంజనిరి, రాజు దంతపు పావడలు దొడిగి వందిమాగధులు కైవారముసేయ నిరుప్రక్కల చామరములు వీవ పురమునందలి. [illegible]ప్పుల మేడకేగెను.



# హరిశ్చంద్ర జననము.

కొన్నిదినములకే అయోధ్యాపురిజనులు గుసగుస లాడుకొనుచుండిరి పురమెల్లెడల రాణిగారికి మొగంబు, చెక్కులు మిక్కిలి తెలుపువారె కోరికలుమీరె. శరీరంబుచిక్కె నూగారుకాలుకొనిదిక్కుగర్భముగుపడెనను వదంతి పరిచారికలచే ప్రజ్వలించెను. క్రమక్రమమున రాజుగారికినిదెలిసి చాలాసంతసించెను వసిష్ఠునిరావించి సంగతినెఱుకపరచెను. ఇటులుండుతరి అంతఃపురమునుండి సుందరాంగుఁపురుష శిశువు నుదయించెనను వార్త వెడలెను. భేరులు, ఢక్కలు, కొమ్ములు, శంఖంబులు, బూరగలు, తారలాదిగల మంగళవాద్యములుమ్రోగెను. పౌరకాంతలు తమదమ యిచ్చవచ్చినటుల మాటలాడుకొనుచు నిరాటంకముగ నంతిపురముఁజొచ్చి బాలకుని గాంచి నచ్చెలువంది దన్నాత్రేయమహర్షిని గొనియాడుచు బుడుతనికి స్నానమాదిగాగలకార్యములుదీర్చిరి. రాజు స్వస్తిపుణ్యాహవాచనముజేయించి పుంసవనుదీర్చించి వసిష్ఠునానతి హరిశ్చంద్రుఁడను నామకరణము విధించెను మంత్రిసామంత, విప్రకవి, గాయక నాటక పరిహాసక పౌరాణికాదులకు బంధుమిత్రులకు నుచితరీతి పారితోషికములిచ్చి సంతుష్టినొందించెను పసుపు కుంకుమ చందన తాంబూలదక్షిణలతో జాతిభేదములునెన్నక స్త్రీలకు చీరలు రవికెలు నిప్పించెను, దీనాంధకకృపణులకు భూరిదక్షిణలు వస్త్రములనిచ్చెను. సకలజనములకు షడ్రసోపేతంబులగు మృష్టాన్నంబుల సంతుష్టిం జెందించెను.

దినదినప్రవర్ధమానుండై వర్ధమానచంద్రుని భాతి వెలుంగు హరిశ్చంద్రుని కైదవవత్సరమున వసిష్ఠుగారిచే విద్యాభ్యాసము చేయించిరి యుక్తవయసు వచ్చునరికి సర్వవిద్యాపారంగతుండయ్యెను సత్యవ్రతునియగు, చంద్రమతియను, కన్యకామణిని పరిణయము గావించిరి. హరిశ్చంద్రుండు అతిథి అభ్యాగతుల యందు పేదల యందును గల ప్రేమయు, నాదరణమును, దేవ బ్రాహ్మణ భక్తియు గలిగి హాసోన్ముఖుండుగా పరిచారకుల నైతిము చక్కగా పోషణ సేయుట యందును, ఋతుకాలముల యందు భార్యతో సురత సుఖంబును, రాజనీతి యందు మదనోపతి దగురీతి ధర్మములు నీతులు గఱపు చుండెను. దత్త యోగీంద్రుని వరప్రసాది యగు, కొమాఱు సర్వగుణసంపన్నుఁడగుటకు మిగుల సంతసించి నానా దేశపు రాజన్యుల రావించి శుభ ముహూర్తమున, కోసల దేశమునకు పట్టాభద్రుని గావించిరి. వింటిరే మహాత్ములారా! యనిన సూతుని గనుఁగొని శౌనకాదులిట్లనిరి. సూతపౌరాణికుఁడా! వరప్రసాది రాజ్యసింహాసన మధిష్టించినపిదప నేమేమి గావించెను. విన కౌతూహలము బొడముచున్నది. గాన, వక్కాణింపుమన సూతుండు చెప్పఁదొడఁగెను. న్యాయపరిపాలకుఁడగు హరిశ్చంద్రుఁడు ధర్మశీలుఁడగుటకు సంతసించి కులగురుండగు వసిష్ఠుల వారిట్లు బోధించెను.

ఓ హరిశ్చంద్రచక్రవర్తీ! మీవంశీయులు ముక్తిగాంచిన మార్గము నింతవఱకు దెలుపుచుంటిని. ఇపుడు వర్ణాశంసప వినుము.

—(హరిశ్చంద్రునకు వసిష్ఠుగారు మహాత్త్వము బోధించుట.)—

సకల విషయములందును మిగుల జాగ్రత్త గలిగి మెలఁగుచు, నతిథుల నభ్యాగతుల నెప్పుడు ననాదరింపక పేదల బోషించుచు యుపకారము సేయుచు భగవద్భక్తుల కపకృతి సల్పక సుకవుల గౌరవించుచు సత్యము దప్పనివారై సత్ప్రవర్తనము వదల కుండిరి. నిర్మలము లయిన ధర్మములు పెక్కులున్నను సత్యముతో సమానముగా

వనియు స్వర్గమును పొందుటకును సత్యము ముఖ్య సోపాన మనియు, సర్వ శ్రేయములు సులభముగ పొంద నగుననియు, పాపక్షయములు ముక్తిలభించుటకును. ముఖ్య సాధన మనియు తల్లి తండ్రి దాత భ్రాత మిత్ర పాత్ర కర్త భోక్త సత్యమే గాని వేరు కాదని నెఱింగిరి. ప్రాణము పోవునంత యాపద సంభవించినను అసత్యమాడలేను. సత్య వాక్కుచే సదానందము సమస్త సుఖములు స్వహస్తగతములనియు చరాచరాత్మక మగు ప్రపంచ మంతయు, సత్యవాదుల వలననే పవిత్రమగునను యాథార్థమతమెఱింగి, యాచరించి ధన్యులైరి. సర్వసారోపనిషత్తును జెప్పెద నాలకింపుము.

శ్రీ

# సర్వసారోపనిషత్

## ప్రారంభః.

శ్లో॥ అథ వైకుంఠే నిలకంఠం ప్రణమ్య । స్వామిన్సర్వలోకైక
నాథ । బ్రహ్మవిదాహం భ్రాంతినాశంకురుష్వ । ఈశపత
ద్వ్య పోహ్యపరాత్పరం పూర్ణమస్మైతి సాక్షో । విష్ణోర్భక్త్యాసమా
నాత్మంచవక్త్రే ఉవాచ ॥

మూ॥ శృణు శిష్య మహచ్ఛ్రేష్ఠం వేద వేదాంత నిశ్చితం తత్సర్వం కృపయా వక్ష్యే శృణు సద్భక్తి మానసః కాయస్యాంతే బహిశ్చైవ । జ్ఞానం నాస్తీతి నిశ్చితం । బ్రహ్మాండ వ్యాపితం పూర్ణం పూర్ణమంతర్బహిస్థితః । పూర్ణ మన్యతరం నాస్తి । తచ్ఛివం సదా

తల్లింగ మచలం భవేత్ । మాయయాపి వందితం బాహ్యాం । తధ్యా
నం కురుసర్వదా । యావత్పశ్యే ద్భృగాకారమ్ । తదాకార మచిం
త్యయా । యావత్పశ్యే మహాకాశం । తదాకాశం సచింత్యయా ।
వ్యోమాతీతమిదం బాహ్యాం । సర్వకారణ వర్జితం । నిరంజనంనిరా
మయం । నిర్దేహ మచలంధ్రువమ్ । తదేవ లింగమిత్యుక్తమ్ । స
యేవ శివముచ్యతే । శివమధ్యే స్థితంవిశ్వమ్ । శివాద్బాహ్యం నకిం
చన । శివాదన్య మితీర్నాస్తి । త్రిషులోకేషు నిశ్చితమ్ । ద్రష్టృ
దృశ్య వశాద్బంధః । ద్రష్టాభావే కుతోభయమ్ । సర్వేంద్రియవిని
ర్ముక్త । జ్ఞానంయత్ర విలీయతే । తత్రజ్ఞానం విసృజ్యేత । సమా
ధిస్తస్యలక్షణమ్ । వ్యోమాంతరేచ మాత్మాన । మాత్మమధ్యేని
రామయమ్ । ధ్యానమాత్మకుర్వీత । సమాధిస్తస్యలక్షణమ్ ।
నిర్దేహం సర్వదానిత్యమ్ । పరేహం సర్వదానహి । ఇతినిశ్చయ
భావేన । సమాధిస్తస్యలక్షణమ్ । ఆగామి సంచితం చైవ । ప్రార
బ్ధం చాపిసంత్యజ । జ్ఞానంశూన్యాసదాచైవ । జన్మశూన్యం స్వభా
వతః । దృశ్యజ్ఞానమయీంకృత్వా । తత్ జ్ఞానంచ విసృజ్యయా । య
స్యజ్ఞానం విశిష్యేత సర్వజ్ఞత్వస్య జాయతే । తస్మాత్సర్వం పరిత్యా
జ్య । పూర్ణమేవావశిష్యతే । చిదాకాశం మహాకాశమ్ । ఆకా
శంచ ద్వితీయ్యకమ్ । శూన్యంకృత్వా చిదాకాశం । మహాకాశమ
వాప్నుయాత్ । భావాభావ ద్వయంత్యక్త్వా । నిరాకాశ స్థితిర్భవే
త్యజేద్విద్యా మవిద్యాంచ । క్షరమాక్షరగంత్యజ । బంధమోక్ష
ద్వయంత్యక్త్వా । యేనపశ్యతి తత్యజ । నిరాంహంసేన చిజ్జడాత్మ
కావరణంచిత్వా నిరామయ నిరంజన పరమశ్శివ మాలోక్య నిర
హంకారోభవ । అత్మానాత్మారహిత పరిపూర్ణ పరమాకాశ నిర
తిశయ నిరీశ్వరంలిగ మధ్యే విలీనోభవ । అనావృతేన జీవేశ్వరభా
వం విసృజ్య । స్వస్వరూపమాత్ర । నిర్వికార చైతన్య చ్ఛేదనం కు
ర్యాత్ । నిర్వికార నిర్దేహ బోధమవాప్య సర్వకాల సర్వావస్థే
షు అహంపదార్థరహిత వ్యాపారం కుర్యాత్ । అహం బ్రహ్మేతి
భావం విసృజ్య । అహం రహిత స్థితోభవ । మూలాభావమిదజ్ఞాం

తుమ్ నశరీరం కిమస్థితిమంత్రం సర్వదాజపేత్ । అహంమన్నంస దానాద మితీహి బ్రహ్మవేదనం । అహమన్న మహంనాస్తి । ఇతిని శ్చయమేవహి । నప్రకృతి నపురుషోనకూటస్థ నచాత్మానిత్యోహి పూర్ణో నిర్వికారో నిరాఖ్యః । నిరాకాశ మివాత్మానం తూష్ణీ భూతం స్థితస్సద । మోహకామాది సమ్బంధ । మహంబ్రహ్మే తిభావనమ్ । నిగమాగమశాస్త్రాణి ఉచ్ఛిష్టమివ తుత్యజ । జ్ఞానం మధ్యే జగంనాస్తి । పూర్ణమధ్యే జగన్నహి । స జ్ఞానాదికంస ర్వమ్ । జ్ఞానమాత్మస్వరూపకమ్ । జ్ఞానంనాస్తీతినిశ్శంకమ్ । విరా మోయత్రచాస్తిచేత్ । దృష్టిస్తత్రైవనిశ్చిత్య । నిర్వికారస్థితిర్భవ । సర్వాంతస్థం శివంధ్యాత్వా । సర్వభావం విసృజ్యయేత్ । జ్ఞాన మంతర్బహి ధ్యాత్వా । జ్ఞాత్వాజ్ఞానం పరిత్యజ । షడూర్మిరహి తం పూర్ణమ్ । అష్టావరణ వర్జితమ్ । షడ్వర్గ రహితంపూ ర్ణమ్ । షట్కోశ రహితంసదా । జ్ఞానంత్యక్త్వా జగత్త్యక్త్వా । ఆ త్మసంత్యజ సంతతమ్ । పురుషప్రకృతిద్వయం నాస్తి । ఏకం నాస్తి ద్వయంనహి । బాహ్యాభ్యంతరం నాస్తి । సత్యం సత్యం మహర్షి శం । కర్తృకారణ హీనోయ । మనుత్పన్న మిదంజగత్ । నరశృంగే ణచాకాశం । భిద్యతే జగదస్తిచ । అజాగళే స్తనేక్షీరం । జా యతె జగ దస్తిచ । శ్వానోపి శుక వాక్యేన । వదతిచేజ్జ గదస్తిచ । సూర్యో చంద్ర ప్రకాశేన । భాసతే జగ దస్తిచ । ఔదుంబరే భవేత్పుష్పం । జాయతే జగస్థితమ్ । చందనేపుష్పమా ఘ్రాణమ్ । సంతోషో అస్తిచేజ్జగత్ । రవిరభ్యుదితేరాత్రౌ । చం ద్రోమధ్యస్త మస్తివా । తథైవ సత్యవద్భాతి । ద్రష్టాదృక్ జగస్థి తిః । పాషాణవల్కయోరజ్జు । ర్భవేత్సత్యం భవిష్యతి । పాషాణా జ్జాయతేపద్మమ్ । జగత్సత్యంభవిష్యతి । సూర్యేతథ్యాం తమస్థైవ జగత్సత్యంభవిష్యతి । ఇక్షోఃఫలంభవేద్దృష్టమ్ । జగత్సత్యంభవిష్యతి చంద్రోసూర్యప్రకాశేన । భాసతెజగదస్తిచ గగనారవిందమస్త్యేవ । జగత్సత్యంభవిష్యతి । మత్స్యపాదంభవేద్దృష్టం । జగద్దృష్టంభవిష్య

తి । కుక్కుటస్యాం స్తనేక్షీరమ్ । జాయతేజగదస్తిచ । భేదాభేదద్వ
యం నాస్తి । క్షరమాక్షరగ్ంనచ । మాయా తత్కారణం నాస్తి
సత్యం సత్యం పునః పునః । గురుశిష్య ద్వయంనాస్తి । ఉపదేశం
కథంభవేత్ । ద్వైతాద్వైతం సదానాస్తి । ద్వంద్వహీనం కథంభ
వేత్ । స్తుతినిందాద్వయంనాస్తి । అహంకారం కథంభవేత్ । భూ
తం భవ్యంద్వయంనాస్తి । చిజ్జడస్యకథంభవేత్ । దృక్ద్రష్టాచద్వ
యంనాస్తి । నాస్తిజ్ఞప్తికథంభవేత్ । కర్తృకారణహీనోపి । జగత్స
త్యం కథంభవేత్ । ఉపాధిద్వయగ్ంనాస్తి । జీవబ్రహ్మకుతోభ
వేత్ । కింబధ్నామిచ కింత్యక్త్వా కింగృహ్ణామి కరోతికిమ్ । కింశృ
ణోమిచ కిందృష్ట్వా క్వగచ్ఛామి త్వనుస్తివా । బ్రహ్మణాభాసతేస
ర్వం బ్రహ్మమాయాద్వయం నహి । విద్యావిద్యద్వయంనాస్తి ।
నాస్తిసాక్షివిధీయ్యతే । పుణ్యపాపంద్వయనాస్తి । బంద మోక్షద్వ
యంనహి । శూన్యాశూన్యద్వయంనాస్తి । పూర్ణాత్పూర్ణంత
థానహి । పూర్ణశూన్యద్వయంనాస్తి । యఃపూర్ణమచలంసదా
సర్వాధారం చిదాకాశమ్ । సర్వప్రాణహృదిస్థితం । చిదాకాశే
జగచ్చిత్రమ్ । చిదాకాశంసదానహి । కార్యకర్తృత్వగ్ంనాస్తి । నా
స్తిజ్ఞప్తిసదానహి । ఇతివిజ్ఞేయ యద్భానమ్ । తద్భావం తత్పరిత్య
జ । తూష్ణీమేవస్థితంతూష్ణీమ్ । తూష్ణీభావంనకించనా । బహూన్
ఛ్ఛబ్దాన్ ప్రవక్షేణ । వాగ్వ్యాపారం నిరర్థకమ్ । ఏతత్సర్వా
ర్థగ్ంసర్వమ్ । గురువాక్యేన బోధ్యతే । ఏతచ్ఛ్రవణ మాత్రేన ।
సర్వస్రమపినశ్యతి । బ్రాహ్మణోక్షత్రియోవైశ్య । శూద్రచండా
లపుల్కసాః । తేషాంనవిద్యతేజన్మ । ఇతివేదాంత నిశ్చితమ్ । ఇ
తి వేదాంత సిద్ధాంత. । సారం వేదాంతడిండిమః । మృతంజన్మద్వ
యంనాస్తి । భయభ్రాంతి వినశ్యతిః ॥ ఏతచ్ఛ్రవణమాత్రేణ । స
ర్వసిద్ధికరంభవేత్ ॥ పరమేవ్యోమన్ ప్రతిష్ఠితమితి వేదప్రతిశిష్టతి ॥

—(. సర్వసారోపనిషత్సంపూర్ణః .)—

—(. ఓమ్ శ్శాంతిశ్శాంతిశ్శాంతిః .)—

గద్య ॥ వసిష్ఠ మహర్షిచే హరిశ్చంద్రుండు సర్వ హరోప
నిషత్తాలోకించి సహృదయుండై ధర్మంబు దప్పక దానవఱతు స్మ
రణ ఏమఱక పురజనుల కన్నబిడ్డలవలెగిడ పరిపాలింపుచు, ఉపాది
ద్వయ దోషరహితుండును, శక్తిద్వయ నిరాసనుండును, నాదబిందు
కళాతీతుండులు, సచ్చిదానంద రహితుండును, సర్వజ్ఞుండును, అవా
ఙ్మానస గోచరుండైన పరిపూర్ణాచల బ్రహ్మమును ఉపాసింపుచు,
గురుముఖమున ద్వాదశీ షోడశీ పంచదశీ మంత్ర మంత్రార్థరహస్యా
ర్థములగ్రహించి రాజ యోగమును సాధింపుచు ప్రజాను రక్తి
గా రాజ్యపరిపాలన యాచరింపుచుండెనని సూతుండు శౌనకాదిమ
హర్షులకు దెల్పవిని మహాత్మా! నామరూప నటనాది క్రియలు లే
ని యచలమునకు "శ్రీరామాచల పూర్ణబోధిని" యను నామము గ
ల్గుటకు కారణంబేమి? యనవిని సూతుండు మందహాసవదనార
విందుండై, ఆదికల్పమందు శ్రీదత్తాత్రేయ యోగీంద్రునిచే పరిపూ
ర్ణాచలమనియు త్రేతాయుగమున వసిష్ఠునిచే శ్రీరామచంద్రునికి బో
ధించుటచే "శ్రీరామాచల పూర్ణబోధని" యనియు ద్వాపరమందు
శ్రీసాందీపమహర్షిచే శ్రీకృష్ణభగవానునికి బోధించుటచే "శ్రీకృష్ణాచ
లపూర్ణబోధిని" యనియు కలియుగమందు గురుపరంపరా బృహ
ద్రూపమున వర్ణించుటచే బృహద్వాసిష్ఠ మనియు నిమిత్తనామకర
ణము గలిగెను.

—(. ఫలశ్రుతి. .)—

ఈపొత్తమువలోకించినను పఠనమొనర్చినను వ్రాశినను వినిన
ను ఇహపర సౌఖ్యము గని సంతతానందులై సౌఖ్యమొందగలరు.

గీ॥ వరగగోపాల దేశికప్రభునికృపను। పూర్ణబోధామృతంబున
పుడమిజనుల సమితసంతోషకల్మి। యశముమువిద్య ఘనత శాశ్వత
శుభములు గాంచగలరు॥

గద్య. ఇతిశ్రీ దత్తాత్రేయవరప్రసాదలబ్ధ హరితసగోత్ర వారణా
సివంశపవిత్ర కోటయార్యపుత్ర పుల్లమాంబాగర్భశుక్తిముక్తాఫలరా
మయాఖ్య హరిదాస ప్రణీతంబగు శ్రీరామాచలపూర్ణబోధనియను,
గ్రంథమున ద్వితీయ తృతీయప్రకరణములు దత్తాత్రేయార్పణమస్తు.

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

—(. శ్రీదత్తాత్రేయసమాజమునకు ధర్మకర్తలు. :..

మ || రా || మిర్యాల రామలింగయ్య.
మ || రా || బిజ్జాలరాముస్న కొమారుడు వీరయ్య.
పద్మ బొంతయ్య.
గుమిడెల్లి వెంకటమల్లయ్య.
గుబ్బ రామలింగయ్య.
చేగుకుంట వెంకయ్య. రంగయ్య బలరాం.
శితా వెంకయ్య కొమారుడు మల్లయ్య,
లవంగు లక్ష్మినారాయణ.
కొత్త సోమిశెట్టి.
ఉప్పల శివరాజయ్య.
సెట్టి శివరాజయ్య.
మిరప కాయల యెల్లయ్య.
నామ వీరయ్య.
గోపాలు హనుమయ్య.
ఆముదా మల్లయ్య.
మెముకె బాలయ్య.
సోమసాని వెంకన్న.
కస్తూరి పెదఅంజయ్య. చినఅంజయ్య.
నాగమళ్ళ లక్ష్మయ్య.
చంద్రాచారి.
కోదండ రామయ్య.
హకీం వాసుదేవు. జనార్దనమ్.
చెలువాది అంతయ్య.
కొండా లక్ష్మారెడ్డి. చెన్నారెడ్డి. చందారెడ్డి.
వీరారెడ్డి. వెంకట రెడ్డి. పెదమంగళవారం
కల్యాణం ఆగయ్య.
దరగా బాలయ్య తమ్ముడు దుగయ్య.
ఆదిమూలం రామలింగయ్య.

నీలి విఠోబ. పుటిగంట్ల ఆంజనేయులు. క్యాస చంద్రయ్య.
గుండా భూమన్న. మాగల రామన్న. కరాడి ఆంథోని.
గొల్ల మల్లన్న. కోప్పూరు మల్లప్ప. చిన్నలింగంపల్లి పటేలు రాము
కోలా నరసయ్య. పంతం ఆంజనేయులు. పుప్పు శివయ్య. క్రిష్ణ
పబ్బా ఘంటయ్య. నారాయణ. గట్టు లక్ష్మన్న. గట్టుమల్లయ్య.
యెల్లంరాజు చిప్పాభూమన్న. మహారాజు పేట.
తెల్లాపురంభూమన్న శివరాం. అప్పసులవీరన్న. నరబా క్రిష్టయ్య.
నానకరాంగూడెం శివరాం. చిలుకూరు శ్యామరావు.
సారావీరన్న. రాజన్న. కుంచంయనంతయ్య. కొమారుడువీరయ్య.
టునుగుర్తి నరసింహారావు కొమారుడు వెంకరావు.
చందాపేట చంద్రారెడ్డి పటేలు. కుర్మారు రామక్రిష్టయ్య.
కుర్మారు రాజన్న. పసుపునూరి పుల్లయ్య.
వట్టినాగులపల్లి కిషన్‌రావు. పట్వారి. సెంకిపల్లిపబ్బారెడ్డి
చౌదరిగూడెం తోకాజయ్యన్న కొమారుడుక్రిష్టయ్య
కనకమామిడమల్లరెడ్డిముకద్దం. శ్రీనివాసరెడ్డి. ఫీల్‌ఖానా. చమన్
కొండా వెంకట రంగారెడ్డి. నారాయణ రెడ్డి. బ్రాం క్రిష్ణరెడ్డి.
చెందిప్పరాంరెడ్డి. కొమారుడు బలవంతరెడ్డి దస్తూరు రాజన్న.
నాంపల్లి నారాయణ రెడ్డి. లింగిశెట్టి గుమ్మగుంట్ల రాజన్న
మెలమల బుచ్చిరెడ్డి. దస్తూరు రాజమ్మ కొమారుడు నారాయణ.
పొతునుక నరసింహులమ్మలు. చిరాకు వీరన్నతమ్ముడు బుచ్చన్న.
శరభలింగం నమఃశివాయ. నాంపల్లి లక్ష్మయ్య.
బవురం ప్యాట క్రిష్టయ్య కొమారుడు గురుమూర్తి నారాయణ.
అన్నారపు క్రిష్టన్న. పాలంగుల వీరయ్య. తటిపల్లి కేశవులు.
హకీం నారాయణస్వామి తమ్ముడు, గోపాలస్వామి. డాక్టర్.
వెల్లంకి శేషాచలం. మాస్టర్. కిషన్‌గంజ్. మల్లరెడ్డి ముకద్దం.
చార్‌మనార్ మిఠాయి దుకాణం బాలయ్య. ముఖీం వీరన్న
గూటాలవీరబ్రహ్మం. ఫీల్‌ఖానా కోప్పూరు మల్లయ్య.
బాలయ్య కొమారుడు సాంబయ్య.
భువనాపతి నారాయణ హరిదాసు శిద్దిపేట.